# చందమామ



సంపుటి 103 డిసెంబర్ 2000 సంచిక 6

## ఈ సంచికలో...


### కథలు

రాజసన్మానం (బే.క.) పేజినం.09
అదృష్టజాతకులు పేజినం.16
బిందుసారుడి బొమ్మ పేజినం.20
భూషణంగారి భోషాణం పేజినం.23
కనువిప్పు పేజినం.38
భయం ఎరగనివాడు పేజినం.41
అష్టావధానం పేజినం.52
లోకభీతి-పాపభీతి పేజినం.57
కొడుకు నిర్ణయం పేజి నం.62

### పౌరాణిక సీరియల్

మహాభారతం-59 పేజినం.45

### చిత్రకథ

పిశాచి నాటకం-1 పేజినం.33

### శీర్షికలు

వార్తలలో బాలలు పేజీనం.06
భారత సంస్కృతి - చరిత్ర - 11 పేజినం.28
ఈ నెలలో జన్మించిన ప్రముఖులు పేజినం.32
భారతదర్శనం క్విజ్ పేజినం.60
సృజనాత్మక పోటీ పేజినం.61
ఫోటో వ్యాఖ్యల పోటీ పేజీనం.66


## ఈ నెల విశేషాలు



రాజసన్మానం
(బేతాళ కథలు)

భూషణం గారి భోషాణం





భయం
ఎరగని వాడు

భారత సంస్కృతి
చరిత్ర



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, No.82, Defence Officers Colony, Ekattuthangal, Chennai - 600 097. Editor: Viswam

దూర తీరాల్లో వున్న

**మీ వాళ్ళ కోసం**

ముచ్చటగా ఇవ్వతగ్గ

ఏకైక బహుమతి



# చందమామ

వారి భాషల్లో

వారితో మాట్లాడే

చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, కన్నడ మలయాళం,మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు

పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా

పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారా గానీ చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది చిరునామాకు పంపండి:


PUBLICATION DIVISION

CHANDAMAMA INDIA LIMITED

New 82 (Old 92), Defence Officers Colony,
Ekkatuthangal, Chennai - 600 097.



సంపాదకుడు

విశ్వం



ఉత్తర ప్రత్యుత్తరాలకు:

చందమామ మేగజైన్ డివిజన్

కొత్త నం.82 (పాత నం.92)

డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,

ఈక్కాట్టుతాంగల్,

చెన్నయ్ - 600 097.

ఇ.మెయిల్: Chandamama@ vsnl.com


అమెరికాలో

విడికాపీ $2

సంవత్సర చందా $20

సొమ్ము పంపవలసిన చిరునామా:

ఇండియా అబ్రాడ్

43 వెస్ట్ 24 స్ట్రీట్

న్యూయార్క్, ఎన్.వై 10010

ఫోన్: (212) 929-1727

ఫ్యాక్స్: 212-627-9503



రాబోయే సంచిక సహస్రాబ్ది సంచికగా వెలువడనున్నది. 'భారతదేశం - స్వాతంత్ర్యానికి పూర్వం యాభై సంవత్సరాలు; స్వాతంత్ర్యానంతరం యాభై సంవత్సరాలు' అనే అంశం ఈ సంచిక ప్రత్యేక ఆకర్షణ! దీనిని పదికాలాలపాటు భద్రపరచుకోవాలనుకుంటున్నారా? చందాదారులకు ప్రత్యేకంగా '2001 ప్లానర్' అదనపు ఆకర్షణ. చందాదారులుగా చేరడానికి ఇదే తగిన సమయం. త్వరపడండి. చందా మొత్తాన్ని మనిఆర్డర్/బ్యాంక్ డ్రాఫ్ట్ ద్వారా పంపండి!



సంచాలకులు
చక్రపాణి. బి.నాగిరెడ్డి

# ఈ సంవత్సరానికి వీడ్కోలు!

నూతన శతాబ్దానికీ, నవ సహస్రాబ్దికీ నాంది పలికే తొలి సంవత్సరమని కొందరు ప్రచారం చేయడంతో ఎంతో ఆర్భాటంగా ఆరంభమయిన 2000వ సంవత్సరం ముగింపుకు వచ్చింది. 2001 జనవరితోనే నూతన శతాబ్దం ఆరంభమవుతుందన్ని మరికొందరు అప్పుడే వాదించడం మొదలుపెట్టారు!

ప్రస్తుతం 2000వ సంవత్సరం పూర్తి కావడంతో రానున్న సంవత్సరాన్ని నవశకానికి నాందిగా భావించి దానిని మరపురాని సంవత్సరంగా మలుచుకోవడం మన చేతుల్లోనే ఉన్నది. నూతన సంవత్సరాన్ని, నవశతాబ్దాన్ని, సహస్రాబ్దిని ఆశతో ఆహ్వానించడానికి మనలో అంతర్గతంగా ఉన్న ఉత్సాహమే కారణం. నూతన ప్రపంచం, నవశకం, నవయుగం సృష్టించగలమన్న మనిషికున్న తరగని ఆశాభావమే దానికి ఆధారం!

వాస్తవాన్ని పరిశీలిస్తే కాలంలో మంచీ లేదు; చెడూ లేదు. నిజానికి కాలానికి ఆరంభమూ లేదు; అంతమూ లేదు. గడచిన 2000 సంవత్సరాలే కాలం వయసు కాదు. కేవలం మన సౌకర్యం కోసం కాలాన్ని కొలుచుకుంటున్నాం. కొత్త సంవత్సరంగాని, నూతన శతాబ్దిగాని, సహస్రాబ్దిగాని వాటంతట అవి మంచీ కాదు; చెడూ కాదు. వాటిని మనం ఎలా ఉపయోగించుకుంటాం అన్న దానిని బట్టే వాటి మంచి చెడ్డలు ఆధారపడి ఉంటాయి!

మన మేలుకోసం, పొరుగువారి క్షేమం కోసం మనలోని శక్తిసామర్థ్యాలను సక్రమంగా ఉపయోగించుకోవాలన్న పట్టుదల ఉన్నంతకాలం — కొత్త సంవత్సరం గురించీ, నూతన శతాబ్ది, నవ సహస్రాబ్దుల గురించీ కమ్మని కలలు కనడంలో తప్పులేదు.

మనం అనుభవాలద్వారానే ఎన్నో విషయాలను నేర్చుకుంటాం. అలాంటి అనుభవాలెన్నింటినో మనకు అందించి, కాలగర్భంలో కలిసిపోతూన్న ఈ సంవత్సరానికి కృతజ్ఞతలతో వీడ్కోలు పలుకుదాం!

# వార్తలలో బాలలు

## ప్రెసిడెంటుకు బాలసలహాదారు!




గౌటెమాలా ప్రెసిడెంట్ అల్ఫాన్సో పోర్టిలో – విద్య, పర్యావరణ శాఖలకు సంబంధించిన విషయాలలో ఎవరినుంచి సలహాలు తీసుకుంటున్నారో మీకు తెలుసా? ఒక పదమూడేళ్ళ కుర్రవాడినుంచి! ఆ కుర్రవాడి పేరు శామ్యువల్ ఈస్టిబాన్ గోమెజ్. అంతేకాదు. ఆ కుర్రవాడు మంత్రిమండలి సమావేశాలకు ప్రత్యేక ఆహ్వానితుడుగా హాజరవుతున్నాడు. బాల మేధావిగా పేరుగాంచిన ఈ పాఠశాల విద్యార్థి అప్పుడే గౌటెమాలా నగర విశ్వవిద్యాలయ గణిత విభాగంలో అడ్వాన్స్ కోర్స్ చేయడం ప్రారంభించాడు. అతడు 'ఏరోనాటిక్ ఇంజనీయరింగ్' చదవాలని ఆశిస్తున్నాడు. 'ఒకరోజు ప్రెసిడెంట్' (ప్రెసిడెంట్ ఫర్ ఎ డే) 'ఒకరోజు స్పీకర్' (కాంగ్రెషనల్ ప్రెసిడెంట్) మొదలైన రాజకీయకార్యకలాపాలలో కూడా పాల్గొన్నాడు. అంతర్జాతీయ దౌత్యరంగం కూడా అతనికి కొత్తేమీకాదు. అమెరికా ప్రెసిడెంట్ బిల్‌క్లింటన్; స్పానిష్ గద్దెకు వారసుడైన ప్రిన్స్ ఫిలిప్ ; ఈ సంవత్సరారంభంలో గౌటెమాలా ప్రెసిడెంట్ పదవినుంచి పైదొలగిన అల్ఫారో అర్జూ మొదలైన వారితో సమావేశమయ్యాడు. విద్యామంత్రిత్వశాఖ ద్వారా విద్యాసహకారసంఘాల అభివృద్ధికోసం ఆ కుర్రవాడు కృషి చేస్తున్నాడు.

కెనడా విద్యాశాఖమంత్రి పెన్నీ ప్రిడ్డీకి సలహాలిస్తూన్న ఎనిమిదిమంది సభ్యులు గల సలహా సంఘంలో – సర్రేకు చెందిన పునీత్ చెహాల్, కామ్‌లూప్స్‌కు చెందిన సుల్తాన్ సందూర్ అనే భారతీయ విద్యార్థులు సభ్యులుగా చోటుచేసుకోవడం ఇక్కడ చెప్పుకోతగ్గ మరో విశేషం!

## అతిపిన్నవయసు ఐంద్రజాలికురాలు



సతీష్‌దేశ్‌ముఖ్ అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన ఇంద్రజాల నిపుణుడు. ఇటీవల, ఆయన నిర్వహించిన ఒక కార్యక్రమంలో 'భ్రమ' (ది ఇల్యూషన్) అనే అంశాన్ని ఆయన మూడేళ్ళ కుమార్తె ప్రిన్సెస్ కిమాయా ప్రదర్శించింది. ఆ విధంగా ఆ చిన్నారి ప్రపంచంలోనే అతిపిన్నవయస్కురాలైన ఐంద్రజాలికురాలు అనే పేరు తెచ్చుకున్నది. ఆమె ఇంతకుముందే బొంబాయి సుప్రసిద్ధ హీరో హృతిక్ రోషన్‌తో కలిసి సినిమాలో నటించి ప్రేక్షకులను అలరించింది!

# మరికొందరు మేధావులు (?)

- జస్టిన్ చాప్‌మన్‌కు ఇప్పుడు ఆరేళ్ళు. రెండేళ్ళ వయసులో చదవడం ప్రారంభించి, ఇప్పుడు రోచెస్టర్ విశ్వవిద్యాలయంలో కళాశాల తరగతులకు హాజరవుతున్నాడు. హోమర్ రచించిన 'ఇలియడ్' మీద వ్యాసం సమర్పించి బి-గ్రేడ్ పొందాడు. ప్రస్తుతం చరిత్ర ప్రారంభ పాఠాలు అధ్యయనం చేస్తున్నాడు.
- లాస్ ఏంజెలెస్‌లోని ఎమ్మెట్/ఫర్లా ఫిల్మ్స్ సంస్థ 'క్యాంప్‌గ్రిజ్లీ' అనే చిత్రాన్ని నిర్మిస్తున్నది. ఆ కుటుంబచిత్రానికి దర్శకుడిగా కైలీస్టావాల్ అనే పదకొండేళ్ళ కుర్రవాణ్ణి ఆ నిర్మాణసంస్థ ఎంపిక చేసింది. అందువల్ల అతడి కోసం ప్రత్యేకంగా బుల్లి కుర్చీ తయారుచేసింది!




- కేరళ రాష్ట్రం వయనాడు ప్రాంతంలో రంజాన్ సందర్భంగా ఏర్పాటయ్యే సమావేశాలలో పన్నెండేళ్ళ రషీద్ పాల్గొని అందరినీ ఆశ్చర్యపరుస్తున్నాడు. మత సంబంధమైన విషయాలను గురించి ఇంగ్లీష్, ఉర్దూ, అరబిక్, హిందీ భాషలలో అతడు అనర్గళంగా ఉపన్యసిస్తాడు!




## విద్యార్థి ప్రారంభించిన నాలుగు వెబ్‌సైట్స్!

ఎ.వి. దినేష్ చెన్నయ్ నగరంలో 11వ తరగతి విద్యార్థి. 'మైక్రోసాఫ్ట్' నిర్వహించిన రెండు పరీక్షలలో ఉత్తీర్ణుడయ్యాడు. అప్పుడతని వయసు పన్నెండేళ్ళు. అప్పటినుంచే అతడు రకరకాల వెబ్‌సైట్స్ రూపొందించడంలో నిమగ్నుడయ్యాడు. పసిపిల్లలకు స్పైసీకిడ్స్ డాట్ కామ్; టీనేజ్ వాళ్ళకు టీనేజ్ డాట్ కామ్; ప్రోగ్రామర్స్‌కి డెవలపర్స్ ఇన్‌ఫోవే డాట్ కామ్; రకరకాల సైట్స్‌కి సంధానపరచే దినేష్ వరల్డ్ డాట్ కామ్ అంటూ నాలుగు రకాల వెబ్‌సైట్స్ ప్రారంభించి ఇప్పుడు దినేష్ 4,000 పేజీల ఆన్‌లైన్ సమాచారాన్ని సమకూర్చాడు.



# ఒక సంవత్సరం పూర్తయిన సందర్భంగా....

ఒక సంవత్సరం క్రితం చందమామ ప్రచురణ మళ్ళీ ప్రారంభమయింది. అది మనకందరికీ ఆనందకరమైన విషయం!

పన్నెండు నెలలు చందమామ క్రమం తప్పకుండా వెలువడింది. మీ అభిమాన పత్రికకోసం మీరు చూసిన ఎదురుచూపులు వృధా కాలేదు. మేము మిమ్మల్ని నిరాశ పరచలేదని విశ్వసిస్తున్నాము. చందమామ అనగానే గుర్తుకువచ్చే నిత్యనూతనమైన బేతాళ కథలు; ఆకర్షణీయమైన చిత్రాలతో పురాణ, జానపద సీరియల్స్; దేశవిదేశాల చక్కని కథలు; ఆసక్తికరమైన శీర్షికలు — ఇవన్నీ ఎప్పటిలాగే మీ చందమామలో చోటుచేసుకున్నాయి. ఇటీవల ఒలింపిక్ క్రీడోత్సవాల పుట్టుపూర్వోత్తరాలను 'కామిక్స్'లో ప్రచురించాము. పదహారేళ్ళలోపు పిల్లలు రాసిన కథలకు, పిల్లలచేతే చిత్రాలు వేయించి గతసంచికలో ప్రచురించాము. దీనినొక వినూత్న ప్రయోగంగా భావిస్తున్నాము.

ఈనాడు మనం క్షణం క్షణం అమితవేగంతో ముందుకు దూసుకుపోతూన్న సమాచార సాంకేతిక యుగంలో పయనిస్తున్నాము. దేశవిదేశాలలోని శ్రేయోభిలాషులనుంచి లభిస్తూన్న ఆర్థిక సహకారంతో, నైతికబలంతో — మారుతూన్న కాలానికి అనుగుణంగా చందమామ కూడా నూతన రంగాలలో అడుగుపెట్టాలని నిర్ణయించింది. చందమామ గొడుగునీడలో — సిండికేషన్, టెలీ సీరియల్స్, వెబ్‌సైట్, కథాచిత్రాలు అంటూ వివిధ కార్యకలాపాలు శాఖోపశాఖలుగా విస్తరించనున్నాయి!

అంటే — చందమామ తన వైభవాన్ని చేజిక్కించుకున్నట్టే! ఈ ఆనందసమయంలో రోజురోజుకూ పెరుగుతూన్న చందమామ ప్రియతమ పాఠకులకూ; కష్టసుఖాలలో మాకు అండగా ఉంటూన్న అసంఖ్యాకులైన శ్రేయోభిలాషులకూ ; పత్రిక విజయవంతంగా వెలువడడానికి కలిసికట్టుగా కృషి చేస్తూన్న వారందరికీ; తగిన సమయంలో మాకు స్ఫూర్తినిచ్చి ఈ విజయపరంపరకు దారిచూపినసహృదయులు శ్రీవినోద్ సేథీగారికీ; మా ప్రయత్నాలను ఆశీర్వదిస్తూన్న దివ్య మాతృశ్రీకీ మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.

చందమామను మళ్ళీ ప్రారంభించాక జరుపుకుంటూన్న ఈ ప్రథమ వార్షికోత్సవ సందర్భంగా — అతిపెద్ద చందమామ కుటుంబంలోని ప్రతి ఒక్కరికీ హృదయపూర్వక శుభాకాంక్షలు తెలియజేస్తూ, ఈ సంచికను భావి తరానికి అంకిత మిస్తున్నాము.

— బి. విశ్వనాథరెడ్డి,
ప్రచురణకర్త.



బేతాళ కథలు

# రాజసన్మానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, భీతి గొలిపే ఈ శ్మశానంలో పడ రాని పాట్లు పడుతూ కూడా, నువ్వు వెనుదిరిగి నీరాజ్యానికివెళ్ళే ప్రయత్నం చేయకపోవడం, నాకు చాలా అసం దర్భం అనిపిస్తున్నది. ఒకవేళ నీ రాజ్యం లోని పరిస్థితులు, ఇంతకన్నా భీతా వహంగా వున్నవేమో అన్న అనుమానం కూడా కలుగుతున్నది. అదే నిజ మైతే, నువ్వు తిరిగి నీ రాజ్యం చేరి, చేతనైనంతలో అరాచకపరిస్థితులను



ఈ మతకలహాల వల్ల ప్రజలు రెండు వర్గాలుగా చీలిపోయి దేశం బలహీనపడే ప్రమాదమున్నదని గ్రహించిన శంతనుడు, మంత్రులతో ఈ విషయమై చర్చిస్తే, వారిలో శివభక్తులు, వైష్ణవభక్తిని నిషేధించమన్నారు. విష్ణుభక్తులు, శివనామోచ్చరణ కూడా దేశంలో జరగకూడదన్నారు. మతమౌఢ్యం మంత్రుల దాకా పాకిందని గ్రహించాక, శంతనుడు ఏమి చేసేందుకూ పాలుపోక విచారగ్రస్తుడయ్యాడు.

శంతనుడి భార్య మహారాణి వివేకవతి, భర్త దిగులుగా వుండడం గమనించి కారణమడిగి తెలుసుకుని, "మీరు శివభక్తులా, విష్ణుభక్తులా ప్రభూ!" అని అడిగింది.

"నేను దేశభక్తుణ్ణి. నా దేశప్రజలు వారిని కొలుస్తున్నారు కాబట్టి, శివవిష్ణువులిద్దరూ నాకు ఆరాధ్య దైవాలే!" అన్నాడు శంతనుడు.

"మన పురాణాలు రూపాలు వేరైనా దేవుడొక్కడే అని ఘోషిస్తున్నాయి. శివుడి రూపంలోని విష్ణువునూ, విష్ణురూపంలోని శివుణ్ణీ కొలవడం మన సంప్రదాయం. శివకేశవులిద్దరూ ఒక్కటేనని నిరూపించడానికి మన రాజ్యంలో అక్కడక్కడ హరిహరనాధుడి ఆలయాలున్నాయి. ప్రస్తుతం వాటికి ఆలనా పాలనా లేదు.మీరు హరిహరనాధుడి గొప్పతనాన్ని ప్రజల మధ్యకు వెళ్ళి చాటండి. వారిలో మంచి మార్పు రావచ్చు," అన్నది వివేకవతి.

శంతనుడు చిరునవ్వు నవ్వి, "హరిహరులు వేరుకాదని సామాన్యులకు చెప్పడం కష్టం కాదు. కానీ కొందరు స్వార్థపరులు

చక్కదిద్దే ప్రయత్నం చేసి, రాజు శంతనుడిలా సమస్యకు పూర్తి పరిష్కారం కనుగొన్నట్టు, ఆత్మవంచన చేసుకోవడం మేలు. నీకు శ్రమతెలియకుండా, ఆ రాజు కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

ఒకానొకప్పుడు విదర్భదేశాన్ని శంతనుడనే రాజు పాలించేవాడు. ఆ సమయంలో రాజ్యం సుభిక్షంగానే వున్నప్పటికీ, మతకలహాలాయనకు తలనొప్పిగా పరిణమించాయి. శివభక్తులు, విష్ణుభక్తులు పరస్పరం కలహించుకుంటూ, ఒకరి ఆలయాలనొకరు నేలమట్టం చేసుకునేవారు. ఒకరికొకరు ఎదురయితే కారణం లేకుండానే కలహించుకునేవారు. కయ్యానికి కాలుదువ్వేవారు. ఒకరి ఆస్తుల నొకరు ధ్వంసం చేసుకునేవారు. ఇంకా ఆగ్రహం పెచ్చుమీరితే ఒకరినొకరు చంపుకునేవారు.

మతం పేరిట సామాన్యప్రజను రెచ్చగొడు తున్నారు. వారు మతసామరస్యానికి దారి తీసే పనులను సాగనివ్వరు. నేను మత ద్రోహం చేస్తున్నానని ప్రజలను నా పైకి ఉసి గొల్పవచ్చు. అప్పుడు నన్ను నేను రక్షించు కునేందుకు, సైనికబలాన్ని ఉపయోగిం చాల్సివస్తుంది. అందువల్ల రక్తపాతం జరుగు తుంది. ఎట్టి పరిస్థితుల్లోనూ సామాన్యు లను రక్తపాతానికి గురిచేయడం, నాకిష్ట ముండదు,'' అన్నాడు.

''తమరు ప్రజల మధ్యకు శంతను మహారాజుగా వెళ్ళకండి. హరిహరనాధు డనే పేరుతో యోగివేషంలో వారిని ప్రబో ధించండి,'' అన్నది వివేకవతి.

''తమ స్వార్థం కోసం సామాన్యులను మహారాజుపైకే ఉసిగొల్పగల దుర్మార్గులు, యోగిని మాత్రం విడిచిపెడతారా?'' అన్నాడు శంతనుడు.

ఇందుకు వివేకవతి వద్ద ఒక ఉపాయ మున్నది. చిన్నతనంలో రాజాంతఃపురానికి వచ్చిన ఒక మునికి ఆమె అమిత భక్తి శ్రద్ధలతో సేవలు చేసింది. ముని వెళ్ళిపోతూ ఆమె కొక ఉంగరాన్నిచ్చాడు. అది ధరించిన వారిపై అస్త్రశస్త్రాలే కాదు, ప్రకృతిశక్తులు కూడా ఎలాంటి ప్రభావమూ చూపలేవు. అయితే లోకోపకార్యానికి పూనుకున్నప్పుడే, ఆ ఉంగరం తన ప్రభావాన్ని చూపిస్తుంది.

''ఇంతకాలం ఆ ఉంగరాన్ని పూజా మందిరంలో వుంచాను. ఇక దానికి ప్రజా మందిరంలో ప్రవేశించాల్సిన సమయం వచ్చింది!'' అంటూ వివేకవతి, ఆ ఉంగరం తెచ్చి భర్తకు ఇచ్చింది.



విచిత్రంగా, ఆ ఉంగరం ధరించిన వెంటనే శంతనుడి రూపం యోగిలా మారి పోయింది. ఆయన రాణిని మెచ్చుకుని, ప్రజలమధ్యకు వెళ్ళాడు. హరిహరనాధుడి గురించి ప్రబోధం మొదలుపెట్టాడు. దుర్మా ర్గుల ప్రలాపాలు నమ్మి ప్రజలాయనపై రాళ్ళు రువ్వారు. కత్తులు దూశారు. గుంపుగా మీద పడి హింసించబోయారు. అవన్నీ ప్రహ్లాదు డిపై హిరణ్యకశిపుడి ప్రయత్నాల్లా విఫల మయ్యాయి. అయితే, ప్రజలు హిరణ్యా కశిపుడంతటి దుష్టులు కాలేరుకదా! త్వర లోనే వారిలో మార్పు వచ్చింది. వారు శివ కేశవులను సమానంగా కొలవసాగారు. ఆ విధంగా, కొన్నాళ్ళకు స్వార్థపరుల ఆట కట్టయింది.

తన కోరిక నెరవేరినందుకు శంతనుడు మహానందపడ్డాడు. అయితే, రాజధానికి



తిరిగివస్తూండగా, అంతగా మనుష్యసంచారం లేని ఒకచోట, ఒక యువకుడు ఆయనపై దాడి చేశాడు. బలిష్ఠుడైన రాజు, ఆ యువకుణ్ణి క్షణకాలంలో లొంగదీసి, ''నేను హరిహరనాథుణ్ణి. దైవకృపవల్ల మహిమలను పొందిన యోగిని! ఈ విషయం తెలియక నువ్వు, నామీద దాడి చేశావు. అయినా నాకు, నీమీద కోపంలేదు. నీవేమి ఆశించి, ఈ పని చేశావో చెప్పు?'' అన్నాడు.

ఆ యువకుడు నిరసనగా శంతనుడి వంక చూసి, ''నువ్వెవరో తెలిసే నేనీ సాహసానికి పూనుకున్నాను. యోగం ద్వారా మహిమలు సాధించవచ్చు. ఆ మహిమలతో ప్రజలను సరైన మార్గంలో పెట్టవచ్చు. కానీ, నువ్వు నీ మహిమలను దుర్వినియోగం చేశావు. మనదేశంలోని అరాచకానికి కారణం దైవభక్తి. ఏ దేశమైనా సుభిక్షంగా వుండాలంటే, ప్రజలు మూఢవిశ్వాసాలు లేని నాస్తికులు కావాలి. నువ్వు ప్రజల దైవభక్తిని దారి మళ్ళించావు తప్ప, వాళ్ళను దైవభక్తి అనే మూర్ఖత్వం నుంచి తప్పించే ప్రయత్నం చెయ్యలేదు,'' అన్నాడు.

అందుకు శంతనుడు, ''ఈ భూప్రపంచంలో అధికసంఖ్యాకులైన ప్రజలు ఆస్తికులు. దైవభక్తి అనేది ఒక గొప్ప నమ్మకం. ప్రపంచమంతటా దైవభక్తి పేరుతో ఎన్నో సత్కార్యాలు జరుగుతున్నాయి. దైవభక్తి మూఢభక్తిగా మారినప్పుడు ప్రజలు మానవత్వాన్ని మరిచిపోవడం నిజమే. అలాంటప్పుడు వారిని దారి మళ్ళించడమే సరైన మార్గమని, నా నమ్మకం. నా నమ్మకాన్ని నేను ప్రచారం చేశాను. నాలాగే నీ నమ్మకాన్ని కూడా నువ్వు ప్రచారం చెయ్యి,'' అన్నాడు.

అప్పుడా యువకుడు తనవద్ద వున్న కావ్యాన్ని రాజుకు వినిపించాడు. శంతనుడు విని ముగ్ధుడై, ''చాలా గొప్ప కావ్యం రాశావు. వెళ్ళి, రాజుకు కనిపించు. తప్పక ఘన సత్కారం చేస్తాడు,'' అన్నాడు.

తర్వాత, ఇద్దరూ విడిపోయారు. శంతనుడు రాజధానికి తిరిగి వెళ్ళి, ఉంగరాన్ని భార్యకు తిరిగి ఇచ్చేశాడు. ఒక రోజాయన కొలువు తీరివుండగా, నాస్తిక యువకుడక్కడికి వచ్చి, ఆయన అనుమతి పొంది సభలో తన కావ్యాన్ని వినిపించాడు. సభికులందరూ హర్షధ్వానాలు చేశారు. శంతనుడు, ఆ యువకుణ్ణి మెచ్చుకుని, ''నాయనా, నువ్వు కారణజన్ముడవు. నీ కావ్యానికి పది వేల వరహాల కానుక పొందే అర్హతవున్నది,'' అన్నాడు.



అప్పుడు మంత్రులు కలుగజేసుకుని, ''ప్రభూ, ఈ యువకుడి కావ్యం గొప్పగా వున్న మాట నిజమే. అందులో సందేహం లేదు. కానీ ఆ కావ్యంలో కొంత దైవదూషణ వున్నది. అది మనదేశంలోని ఆస్తికుల నందర్నీ బాధిస్తుంది. ఈ కావ్యానికి రాజ సన్మానం తగదు!'' అన్నారు.

శంతనుడు, మంత్రుల మాటలకు అంగీ కారసూచకంగా తలవూపి, ఆ యువకుణ్ణి తనను ఏకాంతంలో కలుసుకోమన్నాడు. సభ చాలించాక శంతనుడు ఏకాంతంలో ఆ యువ కుడితో, ''నీ కావ్యం గొప్పదనడంలో సందేహం లేదు. నీ అభిప్రాయాలనూ, నమ్మకాలనూ ప్రజలమధ్య ప్రచారం చేస్తానంటే, హరి హరనాధుడి శక్తులు నీకు సంక్రమించేలా చేయగలను. ఆ శక్తులను నువ్వు ఏ మాత్రమూ స్వార్థానికికాక లోకోపకారానికే ఉపయోగించాలి,'' అన్నాడు.

అందుకాయువకుడు తల అడ్డంగా ఊపి, ''అందరూ యోగులు కాలేరు. లోకో పకారం వల్ల నాకేం ప్రయోజనం? ఇలాంటి కావ్యాలు ఇంకా ఎన్నో రాయాలని నాకు న్నది. దైవభక్తికి ప్రాధాన్యతనిచ్చే ఈ దేశంలో, నాకావ్యాలకు ఆదరణ లేదు. నేను నా తల్లి దండ్రులను పోషించాలి. చెల్లెలికి పెళ్ళిచేయాలి. తర్వాత నేనూ పెళ్ళి చేసుకుని సుఖంగా జీవితం గడపాలి. నా కావ్యాలకు రాజా దరణ లభిస్తే నేను మరిన్ని మంచి కావ్యాలు రాయగలను. రాజాదరణ లేకుండా కావ్య రచనకు పూనుకోవడం నిష్ప్రయోజనం. కాబట్టి కాయకష్టం చేసుకుంటూ కావ్యాల విషయం మర్చిపోవాలి,'' అన్నాడు.

అప్పుడు శంతనుడు ఒక చిత్రపటాన్ని తెచ్చి యువకుడికిచ్చి, ''దీనిని, ఈ నగరం లోని రత్నాకరుడనే నగల వ్యాపారికివ్వు. ఆయన నీకు పదివేల వరహాలిస్తాడు. ఆ



చదు. ఇతరులపై రుద్దనంతకాలం, నీ అభి ప్రాయాలను ప్రకటించుకునే స్వతంత్రం నీకుంది కాబట్టి, నీ కావ్యాన్ని నిషేధించడం లేదు. నీ కావ్యం నాకు నచ్చింది. అందు వల్ల, నా తీరిక సమయంలో నేను సంపా దించిన డబ్బుతో, నీకు సన్మానం చేస్తాను. రత్నాకరుడు కళాప్రియుడు. అతడికిలాంటి చిత్రపటాలంటే ఎంతో ఇష్టం. ఈ చిత్రం వేసింది, ఈ దేశానికి మహారాజని తెలిస్తే, అతడు దీనికి వెల ఎక్కువ కడతాడు. ఈ కళాఖండానికి అతడు సరైన మూల్యం మాత్రమే చెల్లించాలనే ఉద్దేశ్యంతో, నేను నిన్ను నా పేరు గోప్యంగా వుంచమన్నాను," అన్నాడు.

అప్పుడాయువకుడు చేతులు జోడించి మహారాజుకు నమస్కరించి, "ప్రభూ! ఒక మహారాజుకింతటి ఆదర్శముంటుందని ఊహించలేకపోయాను. నాస్తికుడనైన నేను, ఇప్పుడు మీలో భగవంతుణ్ణి చూస్తున్నాను. ఇక నాకు సన్మానాపేక్ష లేదు. మిమ్మల్నే ఆద ర్శంగా తీసుకుని, నన్ను నేను పోషించు కుంటూనే కావ్యరచన చేస్తాను," అన్నాడు.

శంతనుడా యువకుడి భుజం తట్టి, "ప్రజలు మౌర్ఖత్వంలో మునిగిపోకుండా ఆపడానికి, నీవంటి వారి కావ్యాలూ ఎంతో అవసరం. నీవంటి వారిని సన్మానించకపోతే, నా చిత్రకళకు ప్రేరణ వుండదు. ఏ కళకైనా ప్రయోజనముండాలి. నా కళ నీ కావ్య రచ నకు దోహదం చేస్తుంది. నువ్వు నాలోకాక ప్రతి మనిషిలోనూ భగవంతుణ్ణి చూడగలి గితే, నీ కావ్యరచన వల్ల విశ్వమానవకల్యాణం జరుగుతుంది. ఈ చిత్రపటాన్ని తీసుకు వెళ్ళు. రత్నాకరుడెంత అడిగినా, చిత్రకారుడి

తర్వాత మరొకకావ్యం రాసి, నా వద్దకు తీసు కురా. అప్పటికి ఇంకో చిత్రపటాన్ని తయారు చేస్తాను. అయితే, ఈ చిత్రపటం నీకెవ రిచ్చిందీ రత్నాకరుడికి చెప్పకు!" అన్నాడు.

యువకుడు దీనికెంతో ఆశ్చర్యపడి, "మహారాజులు మీరు! మీరు వేసిన చిత్ర పటాలమ్మి నాకు డబ్బివ్వడం దేనికి? ఖజా నాలో సొమ్ములేదా? లేక కవులనూ, కళా కారులనూ సన్మానించే సంప్రదాయం ఈ దేశానికి లేదా?" అని అడిగాడు.

శంతనుడు నవ్వి, "కవులనూ, కళాకారు లనూ సన్మానించే సంప్రదాయం, మన దేశా నికున్నది. దేశమంటే రాజు కాదు; ప్రజలు. ప్రజాప్రతినిధిగా ప్రజల నిర్ణయాన్ని నేను గౌరవిస్తాను. నీ కావ్యం ప్రజామోదం పొంద లేదు కాబట్టి, నీకు రాజసన్మానం లభిం

వివరాలు మాత్రం చెప్పకు,'' అని మరొకసారి హెచ్చరించాడు.

యువకుడు వినమ్రంగా, ''ప్రభూ! నిండుసభలో మహారాజుగా తమరు నన్ను సన్మానించలేకపోయారు. కానీ ఇప్పటిసన్మానం నాకు, రాజసన్మానాన్ని మించిన సంతోషాన్నిచ్చింది. మీరిచ్చిన సూచనలు పాటిస్తూ, ఏదో ఒక రోజున నిండు సభలో, మీ నుంచి రాజసన్మానాన్నందుకోవడానికి ప్రయత్నిస్తాను,'' అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, రాజ్య పాలన అనేది కత్తి మీద సాములాంటిదని, నీకు తెలియంది కాదు. రాజ్యంలోని వివిధ మత విశ్వాసాలుకలవాళ్ళూ, ఆస్తిక, నాస్తిక లాంటి విభిన్న అభిప్రాయధోరణులు వ్యక్తం చేసేవాళ్ళూ, పరస్పరం కలహించుకోవడం అసహజమేమీ కాదు. ఇలాంటి వాళ్ళను రాజు దండనీతితో మాత్రమే పాలించగలడనేది, జగమెరిగిన సత్యం. అలాకాక, నీతి ధర్మబోధలతో వాళ్ళను మార్చడం సాధ్యమా? ఒకవేళ సాధ్యమైనా అది తాత్కాలికమే అవుతుంది. ఇలాంటి తాత్కాలిక ప్రయోజనాన్ని మాత్రమే సాధించి, రాజు శంతనుడు సమస్యలకు శాశ్వతపరిష్కారం కనుగొన్నానని భ్రమించినట్టు కనబడుతున్నది. ఇది ఆత్మ వంచన కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మానవసమాజం ఏ స్థాణువులాగానో చలనం, మార్పూ లేనిది కాదు. మార్పూ, పరిణామం దాని సహజ లక్షణం. అందువల్ల రాజైనవాడు, ఆయా వ్యక్తుల మధ్య వచ్చే వైషమ్యాలను, అప్పటి పరిస్థితులకు అనుగుణంగానే పరిష్కరించవలసివుంటుంది. వివేకి అయిన శంతనుడు అదే చేశాడు. దండనీతి ఇందుకు మార్గం కాదు. సమాజంలోని వ్యక్తులూ, వర్గాల మధ్య వచ్చే వైరుధ్యాలకూ, కలతలకూ తిరుగులేని శాశ్వత పరిష్కారం వుంటుందనుకోవడమే భ్రమ,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]





# అదృష్టజాతకులు

గోపాలపట్నం అనే గ్రామంలో, గోవింద సెట్టి అనే వర్తకుడుండేవాడు. అతడికి అదృష్ట వర్మ అనే కొడుకుండేవాడు. అదృష్టవర్మ పుట్టినప్పటి నుంచీ, గోవిందసెట్టికి సిరి బాగా ఎత్తుకుంది. అతడొక ప్రముఖ వర్తకు డయ్యాడు. అయితే, అదృష్టవర్మ జాతకం యుక్తవయసు వచ్చేసరికి తారుమారయ్యింది. గోవిందసెట్టి భార్య హఠాత్తుగా మరణించింది. సముద్రవ్యాపారానికి వెళ్ళిన అతడి పడవలు మునిగిపోయాయి.పొరుగుదేశంలో వ్యాపారం చేయడానికి వెళ్ళిన అతడి వర్తకపు సరుకును, అడవి మార్గంలో దొంగలు కొల్లగొట్టారు. దాంతో గోవిందసెట్టి దివాళా తీసి మనో వ్యాధితో మంచంపట్టాడు.

కొద్ది రోజులకు చనిపోతాడనగా గోవింద సెట్టి, కొడుకు అదృష్టవర్మను చేరబిలిచి, ''నాయనా! నా వ్యాపారం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా, నీకు అదృష్టవర్మ అని నామకరణం చేసినప్పటినుంచీ అభివృద్ధి చెందింది. నీకు యుక్తవయసు వచ్చేసరికి, భగవంతుడిలా ఎందుకు చేశాడో, నాకర్థం కావడం లేదు. నేను ఆస్తంతా పోగొట్టుకోవ డమేగాకుండా, మంచంకూడా పట్టి, నిన్ను దిక్కులేని వాణ్ణి చేస్తున్నాను. ఈ స్థితిలో నీ భవిష్యత్తు తలచుకుంటే, నాకు మనశ్శాంతి కరువవుతున్నది,'' అని కళ్ళనీళ్ళు పెట్టు కున్నాడు.

అదృష్టవర్మ, తండ్రిని ఓదార్చి, ''కొబ్బరి కాయలోకి నీళ్ళు వచ్చినట్టు సిరి వస్తుందనీ, అలాగే సిరిసంపదలు కరిమింగిన వెలగ పండులోని గుజ్జులా మాయమైపోతుందనీ, పెద్దలు ఊరికే అనలేదు. తుఫాను వల్ల పంటకు నష్టం వచ్చిందని, రైతు భూదేవి మీద కోపగించుకుని వ్యవసాయం మానె య్యడు. అలాగే, ఆటుపోటులు తట్టు కుని, వ్యాపారంలో నిలదొక్కుకునే ప్రయత్నం

డా।। జొన్నలగడ్డ మార్కండేయులు



వ్యాపారి కూడా చేయాలి. నాకు అదృష్టవర్మ అని పేరు పెట్టావు. కొబ్బరి బొండంలోకి వచ్చే నీళ్ళలా, సిరిసంపదలు కలిసొచ్చే అదృష్టం నాకు కలుగుతుందని, ఆశీర్వదించాలి గాని, ఇలా దిగులు పడిపోగూడదు,'' అన్నాడు.

గోవిందసెట్టి, కొడుకు ఆత్మవిశ్వాసాన్ని మెచ్చుకుని, ''పుష్పాలమ్మిన ఊళ్ళోనే కట్టె లమ్మాడన్న సామెత, మన వ్యాపారులకు వర్తించదు. వ్యాపారం చెయ్యడానికి పనికి రాని వస్తువంటూ ఏదీ లేదు. మొదట్లో నేను, ఏరుదాటి రేవు చేరే చిన్న పుట్టిపడ వల మీద వచ్చే సరుకుల మీద సుంకం వసూలు చేసే ఉద్యోగం చేశాను. నువ్వు, చక్రధరం అనే నా స్నేహితుణ్ణి కలుసుకో. అతడు నీకా ఉద్యోగం ఇప్పిస్తాడు. నువ్వు మర్యాదకులోటు అనుకోకుండా, ఆ ఉద్యోగం చెయ్యి. నా ఆత్మ నీతోనే వుంటుంది!'' అని దీవించాడు.

గోవిందసెట్టి చనిపోయాక, అదృష్టవర్మ వెళ్ళి చక్రధరాన్ని కలుసుకున్నాడు. అతడికి చాలా పుట్టిపడవలున్నాయి. వీటిని వర్త కులు నదులలో సరుకులను రవాణా చేసేం దుకు ఉపయోగిస్తారు. ఆ సరుకుల అమ్మకం మీద, కొనుగోలు మీద, సరుకును బట్టి వేసే సుంకాన్ని, సుంకరులు అనే ఉద్యోగుల ద్వారా అతడు వసూలు చేయించేవాడు. అలా వసూలైన డబ్బును లెక్కలు కట్టి, అందులో ప్రభుత్వానికివ్వవలసిన మొత్తాన్ని ఖజానాలో జమకట్టించేవాడు.

చక్రధరం, అదృష్టవర్మను ఆప్యాయంగా చూసి, ''నేను లోగడ సుంకరుడి ఉద్యోగం చేసి, సొంతాన పుట్టిపడవలు కొనుక్కోగలి గాను. మీనాన్న వ్యాపారంలో సుంకరుడిగా సంపాదించిన జీతం పెట్టుబడి పెట్టి కోటికి పడగలెత్తాడు. మేమిద్దరం జీవితంలో ఇలా పైకివచ్చిన వాళ్ళమే. నా స్నేహితుడి కొడు కుగా నీకు ఉద్యోగం కాదు, అప్పుగా కొంత సొమ్ము ఇస్తాను. దాన్ని పెట్టుబడిపెట్టివ్యాపారం చేసి, నీ తండ్రి పూర్వ వైభవాన్ని తిరిగి తీసు కురా! అండగా నేనుంటాను. నీ తండ్రి స్నేహితుడిగా అదే నాకు ఆనందాన్ని కలిగి స్తుంది,'' అన్నాడు.

అదృష్టవర్మ చక్రధరంకు చేతులు జోడించి, ''ఎక్కడపోయిందో అక్కడే వెదుక్కోమన్నారు! తండ్రి మాట జవదాటరానిది. నా తండ్రి దీవెన నాకు పెట్టుబడి. ఆయన చేసిన ఉద్యోగం ద్వారానే, నాకు అదృష్టం కలి సొస్తుందని నమ్ముతున్నాను. సుంకరు డుగా ఉద్యోగం ఇవ్వడమే మీరు నాకిచ్చే



పెట్టుబడి అప్పు. మీ స్నేహితుడి కోరిక కూడా అదే!'' అన్నాడు.

చక్రధరం సరేనని, అదృష్టవర్మకు పుట్టి పడవల మీద సుంకం వసూలు చేసి లెక్కలు కట్టే ఉద్యోగం ఇచ్చాడు.

ఒక రోజున, పుట్టిపడవ మీద మూడు ఇనప్పెట్టెలు రేవు చేరాయి. వాటి యజమాని పెట్టెలు తెరిచి, అదృష్టవర్మకు చూపించి, ''అయ్యా! ఇవి ఖాళీ పెట్టెలు. పెట్టెలకు అద్దె చెల్లించి పడవ దాటించాను. ఇక వీటికి సుంకం చెల్లించవలసిన అవసరం లేదు గదా,'' అన్నాడు.

అదృష్టవర్మ పెట్టెలను పరీక్షగా చూసి, ''ఒక్కొక్క పెట్టెలోను మూడు మణుగుల సరుకు పడుతుంది. వీటిని అమ్మినా డబ్బు వస్తుంది కాబట్టి, సుంకం చెల్లించాల్సిందే!'' అన్నాడు.

పెట్టెల యజమాని దీనంగా, ''అయ్యా! విసుగనిపించినా, దయవుంచి నా మొరాల కించండి. చాలాకాలం క్రితం వర్తకపు సరుకు వేసుకుని, ఒక వర్తకపు బిడారు అడవి గుండా ప్రయాణం చేస్తున్నది. ఆ బిడారులో నేనొక నౌకర్ని. అడవి మధ్యలో, ఆ బిడారును దొంగలు పూర్తిగా దోచుకున్నారు. తెగించి మేమెంత పోరాడినా లాభం లేకపోయింది. నేను స్పృహతప్పి పడిపోయాను. స్పృహవచ్చాక చూస్తే నా పక్కన చచ్చిపడిన గాడిదొకటి, దూరంగా చెల్లాచెదురుగా, ఈ మూడు పెట్టెలూ వున్నాయి. ఆ ప్రదేశంలో ఏవైనా విలువగల వస్తువులు దొరుకుతాయేమో అని చూశాను. ఈ ఖాళీ పెట్టెలు, చచ్చిపడివున్న వర్తకులు, జంతువులు తప్ప మరేం కనబడ లేదు. లోపలవున్న సరుకు దోచుకుని దొంగలు ఈ మూడు ఖాళీ పెట్టెలనూ అక్కడ వదిలేసి వుంటారు! ఇవి గోపాలపట్నం గోవిందసెట్టి గారి పెట్టెలని వర్తకులు చెప్పుకోవడం, నేను విన్నాను. గోపాలపట్నం వెళ్ళి, ఈ పెట్టెలను ఆయనకు ఇచ్చి నా నిజాయితీకి ప్రతి ఫలంగా ఏదైనా నౌకరీ దొరుకుతుందేమో అని వస్తున్నాను తప్ప, ఈ పెట్టెల్ని అమ్మే ఆలో చన లేదు! నా మాట నమ్మండి,'' అన్నాడు.

ఇది విన్న అదృష్టవర్మ కళ్ళు మెరిశాయి. దొంగలు దోచుకున్న వస్తువులలో, తన తండ్రివైన ఖాళీపెట్టెలు తిరిగొచ్చాయన్న మాట! అంటే, ఇందులో తనకేదైనా అదృష్టం కలిసిరావచ్చు. ఇలా అనుకుని, అదృష్ట వర్మ, తండ్రిని తలుచుకుని, నౌకరుకు తానెవ రైందీ చెప్పి, ''నీ నీతి, నిజాయితీలు నాకు నచ్చినై. ఇక నుంచి నిన్ను, నేను పోషిస్తాను. అదృష్టం బాగుండి వ్యాపారం ప్రారంభిస్తే, నువ్వే నాకు నౌకరువి,'' అన్నాడు.

తర్వాత పెట్టెలను నౌకరు చేత పట్టించుకుని చక్రధరం దగ్గరకు వచ్చి, జరిగింది చెప్పి, ''ఈ పెట్టెలు నా తండ్రిగారివని నౌకరు చెప్పినా, మీ అనుమతి లేకుండా సొంతం చేసుకోవడం న్యాయం కాదు. మీ స్నేహితుడి కొడుకుగా కాకుండా, ఒక వ్యాపారిగా నా తండ్రి పెట్టెల్ని నేను స్వాధీనం చేసుకునే విధానం చెప్పండి,'' అని అడిగాడు.

చక్రధరం ఆ పెట్టెలను పరీక్షగా చూసి ఆనందంతో చిన్నగా చప్పట్లు చరిచి, ''ఆహా, నీ తండ్రి చనిపోయేటప్పుడు, తన ఆత్మ సర్వదా నీతోనే వుంటుందన్నమాట అక్షరాలా నిజం! నీ తండ్రి బంగారంలా మెరిసే నకిలీ ఆభరణాల వ్యాపారం చేసేవాడు. వాటిని పెట్టేందుకు, ఈ పెట్టెలు చేయించాడు. చూడు, ప్రతి పెట్టెకూ మూడేసి బద్దీలున్నాయి. అయితే, లక్ష్మీకృప కోసమని కొంత బంగారాన్ని పూజచేసి, బద్దీలుగా చేయించి, ఈ పెట్టెలకు తాపడం చేయించాడు. వీటికి పట్టిన మకిల వదిలించి చూడు. ఈ బద్దీలే పెట్టెలకు శ్రీరామరక్షగా నిలిచి నీ వద్దకు చేర్చాయి,'' అన్నాడు.

అదృష్టవర్మ, ఆ బద్దీలను ఊడదీయించి మెరుగు పెట్టించాడు. అవి మేలిమి బంగారమని తేలింది. అప్పుడు చక్రధరం, ''నీ తండ్రి అన్నట్టుగానే, చేసిన వ్యాపారం దగ్గరే తిరిగి నీకు పెట్టుబడి లభించింది. ఈ బంగారమే పెట్టుబడిగా, నీ తండ్రిలాగా తిరిగి వ్యాపారం ప్రారంభించు,'' అన్నాడు.

అదృష్టవర్మ సంతోషంగా, ''నా తండ్రి ఈ నౌకరు రూపంలో, ఈ పెట్టెలతో నాదగ్గరకు వచ్చాడు, ఈ నౌకరే నా తండ్రి. ఇతడి పేరు మీదే నేను వ్యాపారం ప్రారంభిస్తాను. నా కలిసొచ్చిన అదృష్టం, ఇతడే!'' అన్నాడు.

ఆ విధంగానే అదృష్టవర్మ వ్యాపారం మొదలుపెట్టి, రెండు మూడేళ్ళలో ప్రముఖ వర్తకుల్లో ఒకడయ్యాడు. వ్యాపారంలో అదృష్టవర్మ చొరవా, ప్రదర్శించిన తెలివితేటలను ఎంతగానో ఆనందించిన చక్రధరం, తన కుమార్తె రాగిణితో అతడికి వివాహం జరిపించాడు.

నౌకరు, అదృష్టవర్మకు తండ్రి హోదాలో సుఖంగా జీవిస్తూ, తమ ఇద్దరివీ అదృష్టజాతకాలని మురిసిపోయాడు.





# బిందుసారుడి బొమ్మ

బిందుసారుడు పేదరికంలో పుట్టాడు. గొప్ప వాడు కావాలని ఆశపడ్డాడు. అందుకని రాత్రింబవళ్ళు కష్టపడి పనిచేసి డబ్బు కూడ బెట్టేవాడు. దురలవాట్లను దరిచేరనివ్వకుండా, వృధా ఖర్చులు పెట్టకుండా క్రమశిక్షణ పాటించడంతో, కొంతకాలానికి వ్యాపారానికి తగినంత డబ్బు సమకూరింది. బిందుసారుడా పెట్టుబడితో చిన్న ఎత్తున వ్యాపారం ప్రారంభించి అంచెలంచెలుగా ఎదుగుతూ, పది సంవత్సరాల కాలంలో కోటీశ్వరుడయ్యాడు. అప్పటికాయనకు ఇద్దరు కొడుకులు, ఒక కూతురు.

ఇప్పుడు బిందుసారుడికి జీవితంలో కోరుకున్న విశ్రాంతి దొరికింది. కూతురికి పెళ్ళయి హాయిగా కాపురం చేసుకుంటున్నది. కొడుకులిద్దరు కూడా పెళ్ళిళ్ళు చేసుకుని, వ్యాపారవ్యవహారాలన్నీ సక్రమంగా చూసుకుంటున్నారు. అంతవరకూ రాత్రనక పగలనక శ్రమపడిన బిందుసారుడికిప్పుడు ఊరికే కూర్చోవాలంటే బాధగా అనిపించింది. అయితే, ఆయనకు వ్యాపారమంటే విసుగు పుట్టి వుండడం వల్ల తీరికసమయంలో లలిత కళలను అభ్యసించాలనుకున్నాడు.

కవిత్వం చెప్పాలంటే భాష తగినంతగా రాదు. పాటలు పాడాలంటే గొంతు తిరగదు. ఇక మిగిలిందల్లా బొమ్మలు గీయడం.

ఒకనాడు రోజంతా తన గదిలో కూర్చుని రకరకాల బొమ్మలు వేశాడు, బిందుసారుడు. ఒక్కటీ తృప్తికరంగా లేదు. ''సాధనమున పనులు సమకూరు ధరలోన,'' అని భావించి, వారం రోజులపాటు ప్రయత్నించగా చివరకు ఒకరోజు సింహం బొమ్మను గీసి ఎంతో తృప్తిపడ్డాడు. ఆ బొమ్మను చూసుకున్న కొద్దీ ఆయనకు గర్వం, సంతోషం ఉప్పొంగిపోయాయి. తొందరలోనే తను గొప్ప చిత్రకారుడినైపోయినట్లు కలగన్నాడాయన.

శ్రీరామకమల్

సింహం బొమ్మ చాలా బాగా నచ్చింది! అయితే తన కళను ఇతరులు మెచ్చుకున్నప్పుడే కదా — కళాకారునికి నిజమైన సంతోషం కలిగేది! బిందుసారుడు కూడా తన బొమ్మ మీద అందరి అభిప్రాయాలూ సేకరించాలనుకున్నాడు. ముందు నేరుగా ఆ బొమ్మను చూపించి, ఎలా వుందీ అని అడగాలనుకున్నాడు. కానీ అంతలోనే అది తగదనిపించింది.

అన్ని రోజులూ తనగదిలో కూర్చుని తనేం చేస్తున్నదీ ఎవ్వరికీ తెలియనివ్వలేదు. ఆ కారణంగా ఆయన బొమ్మలు గీస్తున్నట్లు ఎవరికీ తెలియదు. ఇప్పుడీ బొమ్మ చూపిస్తే కొందరు ముఖప్రీతితో మెచ్చుకుంటారు. కొందరు బాధపెట్టాలని వేళాకోళం చేస్తారు. నిజం తెలియాలంటే, ఆ బొమ్మ ఏమిటో ఎవరికీ చెప్పకూడదు. ఇలా ఆలోచించి బిందుసారుడు, తనబొమ్మ వున్న కాగితాన్ని, ఇంటి నడవలో బల్ల మీద పెట్టి, అదేమిటో చెప్పిన వారికి నూరు వరహాలు బహుమతిగా ఇస్తానన్నాడు.

ముందుగా బిందుసారుడి భార్య వచ్చి చూసి, ''మనవడు గీసిన పిచ్చిగీతలివి!'' అన్నది. బిందుసారుడి మనసు చివుక్కుమంటున్నా బయటపడలేదు. తర్వాత కొడుకులిద్దరూ వచ్చి చూసి, ''ఇలాంటి అర్థంలేని వాటి గురించి తలబద్దలు కొట్టుకుంటే, వ్యాపారంలో వేలకువేలు నష్టపోవాలి!'' అని హడావుడిగా వెళ్ళిపోయారు. కొడుకులకు కళాతృష్ణ లేదని నొచ్చుకున్నాడు బిందుసారుడు.

అంతలో కోడళ్ళిద్దరూ అటుగా వచ్చారు. పెద్ద కోడలు బల్లమీద కాగితాన్ని చూసి, ''ఎవరో ఇందులో ఏదో సందేశాన్ని రాశారు. అక్షరాలు పిచ్చిపిచ్చిగా వున్నాయి కాబట్టి, ఇది పైశాచిక భాష అయివుంటుంది,'' అన్నది.

చిన్నకోడలు తల అడ్డంగా ఊపి, ''పెద్దదానివైనా నీకు బొత్తిగా బుర్ర లేదు. కాగితం



మీద రంగులు వలికి అలా అనిపిస్తున్నది కానీ, ఇది భాషా కాదు; అవి అక్షరాలూ కావు,'' అంటూ మామగారు మెచ్చుకుంటాడని ఆశగా చూసింది.

బిందుసారుడు ఏడవలేక నవ్వుతూ, ''నూరువరహాల బహుమతినిపొందే యోగం, నా కుటుంబసభ్యులెవరికీ వున్నట్లు లేదు,'' అన్నాడు.

ఇంతలో ఇద్దరు పనివాళ్ళు అలా వచ్చారు. మొదటి వాడాకాగితాన్ని చూసి, ''ఇది విత్తనాలు పొట్లం కట్టిన కాగితమైవుంటుంది. కొన్ని విత్తనాలు చిట్లి రంగులేర్పడినట్టున్నాయి,'' అన్నాడు.

రెండో పనివాడు వెంటనే నవ్వి, ''నీ తెలివితక్కువతనానికి నాకు నవ్వొస్తున్నది. ఇది పొట్లం కట్టిన కాగితమైతే, దీనిమీద ఎక్కడా ముడతలు లేవేం?'' అని అడిగాడు.

అది విన్న బిందుసారుడిలో కాస్త ఆశ చిగురించి, ''మీ ఇద్దరిలో నువ్వు కాస్త తెలివైనవాడిలా వున్నావు. అదేంటో నువ్వే చెప్పు!'' అన్నాడు. ఆ పనివాడి ముఖం ఇంతయ్యింది. ''ఈ మాత్రం చెప్పలేనా, బాబయ్యా! ఆ కాగితంలో విత్తనాలు పోసి కాసేపుంచి తీసేశారు. పొట్లం కట్టలేదంతే!'' అన్నాడు.

''సంతోషించాలే నీ తెలివికి. వెళ్ళి పెరట్లో పనిచూడు,'' అని బిందుసారుడు కసిరి పంపేశాడు వాడిని.

ఇద్దరు పనివాళ్ళూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయాక, ఆయన మనవడు అయిదేళ్ళవాడు అక్కడికి వచ్చి, ''తాతయ్యా, తాతయ్యా! ఎవరోగానీ చెట్టు బొమ్మను ఎంత బాగా గీశారో! ఈ బొమ్మ నాకివ్వవూ,'' అంటూ బొమ్మను చూసి మారాం చేశాడు.

బిందుసారుడికి పట్టరానంత ఆనందం కలిగింది. ఆయన మనవణ్ణి దగ్గరకు తీసుకుని, ''సింహాన్ని చెట్టంటే మాత్రం ఏం? అసలీ కాగితం మీది గీతల్ని బొమ్మ అన్నది నువ్వొక్కడివే. అందుకే నీకు నూరు వరహాలు బహుమతిగా ఇస్తున్నాను,'' అంటూ వాడిని ముద్దులాడాడు.

ఈ మాటలు వింటూ ఇంకా అక్కడే వున్న బిందుసారుడి భార్యా, ఇద్దరు కోడళ్ళూ కిలకిలమంటూ నవ్వారు — అసలు విషయం అర్థమై!





# భూషణంగారి భోషాణం

భూపాలపురంలో, భూషణంగారిని ఎరగని వారంటూ లేరు. ఆయన వడ్డీవ్యాపారి. ఊళ్ళో ఎవరింట్లో శుభం జరిగినా, అనుకోని కష్టం వచ్చినా భూషణాన్ని ఆశ్రయించక తప్పదు. వచ్చినవాళ్ళ అవసరాన్ని బట్టి, వడ్డీ శాతం పెంచే ఆయన్ను, చాటుమాటుగా ఊళ్ళో వాళ్ళంతా తిట్టుకునేవారు.

ఆయన ఇంట్లో తాతలకాలంనాటి పెద్ద భోషాణం వున్నది. దాని తాళం చెవి, ఎల్లవేళలా భూషణం మొలతాడులో వేళ్ళాడుతూంటుంది. అందులో డబ్బున్నదని తప్ప ఏపాటివున్నదో ఆయన భార్య కనకం కూడా ఎరగదు.

వడ్డీలకు వడ్డీలు గుంజే భూషణం చూడడానికి అతి పేదలా వుంటాడు. చిరుగుల పంచె, అతుకులచొక్కా, అరిగి చిల్లులు పడ్డ చెప్పులు – ఇదీ ఆయన వేషధారణ.

కనకం కాపరానికి వచ్చి పదేళ్ళు గడిచినా, ఆమె ఒంటి మీద చిన్నమెత్తు బంగారం కూడా లేదు. ఆమె సత్తెకాలపు మనిషి కాబట్టి, నాసిరకం ముతకచీరలో, పేద ముత్తయిదువులా నోరుకట్టుకుని కాపరం చేయవలసివచ్చినా, భర్తను పల్లెత్తుమాట అనేది కాదు.

ఒకసారి ఏదో పేరంటంలో, అమ్మలక్కలు తనను గురించి అనుకుంటున్న మాటలు కనకం చెవినపడ్డాయి. ''ఓ పిల్లా జెల్లా లేరు! అయినా కడుపు కట్టుకుని మరీ దాస్తారు. ఈ కనకం మెడలో అరిగిపోయిన మంగళ సూత్రం తప్పించి మరేం వుంది!'' అంటూ కరణం గారి భార్య నలుగురిలో ఈసడిస్తూ మాట్లాడింది.

ఆ మాటలకు మునసబు భార్య పకపక మంటూ నవ్వి, ''వాళ్ళింట్లో తాత ముత్తాతల నాటి పెద్ద భోషాణం ఒకటుందట. మా

మాచిరాజు కామేశ్వరరావు



అత్తగారి వయసు వాళ్ళకు చాలామందికి తెలుసు. దాని తాళంచెవిని, ఆ భూషణం ఎప్పుడూ మొలతాడుకు వేలాడవేసుకుని వుంటాడు. అంటే – వడ్డీలమీద వచ్చే డబ్బూ, ఇతరత్రా సంపాదనా, అంతా ఆ భోషాణంలో దాస్తాడన్నమాట!'' అన్నది.

ఆ మాటలు విన్న కనకానికి ఎంతో అవమానమనిపించింది. ఆ రాత్రి ఆమె అన్నం ముట్టకుండా, భూషణంతో, ''ఈ క్షణంలో నాకు భోషాణం తాళం తీసి, లోపల ఎంత డబ్బున్నదో చూపించకపోతే, ఈ రాత్రికి రాత్రేఏ నుయ్యో గొయ్యో చూసుకుంటాను,'' అన్నది.

ఆమె అన్నంతపనీ చేస్తుందని హడలిపోయిన భూషణం, ''సరే, అలాగే చూద్దువు గాని. కాని ఆ చూసిందేమిటో అప్పటికప్పుడే మరిచిపోవాలి,'' అంటూ భోషాణం మూత తెరిచాడు.

కనకం కళ్ళు చెదిరిపోయాయి. భోషాణం సగం వరకూ, కళ్ళు మిరుమిట్లుకొల్పుతూ బంగారు కాసులు. వాటిని చూస్తూనే కనకం పట్టరాని కోపంతో, ''ఇంత బంగారం భోషాణంలో పెట్టుకుని, నన్ను దిష్టిబొమ్మలా వీధిలోకి పంపిస్తావా? పైగా పండగ రోజుల్లో కూడా పచ్చడి మెతుకులేనా మనం తినడం!'' అన్నది.

''ఒసే, వెర్రిదానా, అంతపెద్దగా మాట్లాడకు. ఇదంతా ఎవరికోసమనుకున్నావు? భోషాణంలో మిగిలివున్న సగం నిండగానే, మనం దీన్ని తీసుకుని పట్నం వెళ్ళిపోదాం. నేను సముద్రవ్యాపారం మొదలు పెడతాను. ఆపైన నీ ఒళ్ళంతా బంగారమే!'' అన్నాడు భూషణం పట్టరాని సంతోషంతో పెద్దగా నవ్వుతూ.

''అయితే మరి ఈ భోషాణం నిండేదెప్పుడు?'' అన్నది కనకం అనుమానంగా.

''అంతా ఆ పైవాడి దయ! ఇది నిండే వరకూ, ఒక్క కాసు కూడా ముట్టనని ఒట్టేసుకున్నాను,'' అంటూ, భోషాణం మూతమూసేశాడు భూషణం.

ఆ రాత్రి కనకానికి ఒక కల వచ్చింది. ఇద్దరు మనుషుల సాయంతో భూషణం, భోషాణాన్ని గుర్రపుబండిలో పెడుతున్నాడు. తెల్లవారాక, ఆ కల గురించి భర్తకు చెప్పి, కనకం, ''మన పట్నం ప్రయాణం దగ్గర పడినట్టుగా వున్నది,'' అన్నది.

''అలాగా! ఆ ధనలక్ష్మి కృప వుండాలే కానీ, ఒక్కరోజులో కాసులతో భోషాణం నిండి పోదూ,'' అంటూ భూషణం మహానంద పడిపోయాడు.

ఆ సాయంత్రం భార్యాభర్తలిద్దరూ, అష్ట లక్ష్మీ ఆలయానికి వెళ్ళి, తమ కల నిజం కావాలని మొక్కుకున్నారు. తర్వాత వాళ్ళు, పూజారి బాదం ఆకులలో పెట్టి ఇచ్చిన చక్రపొంగలి ఒకపెడగా కూర్చుని ఆనందంగా తినసాగారు.



ఆ సమయంలో, ఆలయమంతా హడా వుడిగా కలియతిరుగుతూ, పెద్ద తలపాగా లతో, గుబురు మీసాలతోవున్న ఇద్దరు ఆజాను బాహులు, అక్కడికి వచ్చి, పూజారిని, ''అయ్యా! సన్నగా, పొడవుగా, తేనె కళ్ళతో, పెదవిపైన పెద్ద పుట్టుమచ్చతో వుండే అంద మైన అమ్మాయి, ఇటుగాని వచ్చిందా?'' అని అడిగారు.

ఆ మాటలు భూషణం, కనకం విన్నారు. పూజారి, వాళ్ళతో అలాంటి అమ్మాయి ఎవరూ రాలేదని చెప్పాడు. వాళ్ళు నిరాశగా వెనుదిరగడం చూసి పూజారి, ''ఇంతకూ ఎవరా అమ్మాయి?'' అని అడిగాడు.

వాళ్ళు గొంతు తగ్గించి పూజారితో, ''ఎవరో కాదు, మన యువరాణి చంద్రరేఖ! ఆమె ఆ మధ్య తూర్పుకొండ ప్రాంతాలకు విహా రానికి వెళ్ళినప్పుడు, మహాఅందగాడైన ఒక చెంచుయువకుణ్ణి ప్రేమించింది. ఆ సంగతి తెలిసి రాజుగారు మండిపడి, వంశ గౌరవం వల్లకాటిపాలవుతుందని, యువరాణిని గట్టిగా కోప్పడ్డాడు. ఆమె రహస్యంగా భవనం వదిలి పారిపోయింది. రాజుగారు ఆమెను సురక్షితంగా తీసుకువచ్చిన వారికి, యాభై వేల వరహాల బహుమతి ప్రకటించారు. మేము ఆమె కోసం గాలిస్తున్నాం!'' అని చెప్పి వెళ్ళిపోయారు.

''ఆహా! ఆ యాభై వేల వరహాలతో, మన భోషాణం నిండిపోతుంది!'' అన్నాడు భూషణం.

''ఇంకేం! ఆమెను వెతుకుతూ బయలు దేరు,'' అన్నది కనకం.

''ఆ తూర్పుకొండల్లోకా? ఇంకా నయం, ఆ కొండప్రాంతాలలో పులులూ, ఎలుగు బంట్లూ విచ్చలవిడిగా తిరుగుతుంటవి,'' అన్నాడు భూషణం.

ఆ రాత్రి భార్యాభర్తలు భోజనాలు ముగించి, పడుకోబోతూండగా, వీధి తలుపు చప్పుడైంది. ఇంత రాత్రి వేళ వచ్చిన వాళ్ళె వరా అనుకుంటూ, భూషణం పోయి తలుపు తెరిచి అక్కడ నిలబడిన యువతిని చూసి నిర్ఘాంతపోయాడు. ఆ వచ్చినది మరెవరో కాదు, యువరాణి! సన్నగా, పొడవుగా, తేనె కళ్ళతో, పెదవిమీద పుట్టుమచ్చతో చాలా అందంగా వున్నదామె.





''ఒంటరిదాన్ని! ఈ రాత్రి మీ ఇంట ఆశ్రయం ఇస్తారా?'' అన్నదామె.

''దానికేం భాగ్యం! లోపలికి రండి,'' అంటూ, ఆమె లోపలికి రాగానే, పక్క గదిలో వున్న కనకం దగ్గరికిపోయి, ''మన పంట పండిందే! ఆ యువరాణి సరాసరి మన ఇంటికే వచ్చింది,'' అన్నాడు భూషణం.

కనకం అంత దూరానవున్న, ఆ యువ రాణికేసి చూసి, ''యువరాణి అని నాకు నమ్మకం కలగడం లేదు. కిరీటం ఏది? ఒంటి నిండా నగలేవి?'' అన్నది.

''రహస్యంగా పారిపోతున్న రాకుమారి, అవన్నీ ధరిస్తుందా? వేషం మార్చుకున్నదన్న మాట! నేను ఇప్పుడే బసవన్న బాడుగబండిలో బయలుదేరి, రాత్రికి రాత్రే రాజుగారిని కలుసుకుని, తీసుకువెళ్ళడానికి భటులతో సహా వస్తాను. రేపు రాత్రికే మన భోషాణం నిండిపోతుంది,'' అంటూ భూషణం పెరటి దారిన పోయి, బసవన్నబండిలో రాజధానికి బయలుదేరాడు.

బండి సగం దూరం వెళ్ళగానే నిలిచి పోయింది. ముందు చాలా బళ్ళు నిలబడి వున్నాయి. దారిలోని ఏరు పొంగింది. బస వన్న ముందుకు వెళ్ళి చూసివచ్చి, ''తెల్ల వారే లోగా ఏరుతీసే సూచనలు లేవు. రాత్రికి ఇక్కడే మనకు జాగరణ తప్పదు !'' అన్నాడు.

ఇది విన్న భూషణానికి నెత్తిమీద పిడుగు పడినట్టయింది. తెల్లవారేలోగా ఇల్లు చేరక పోతే, యువరాణి ఇంట్లోంచి బయటపడు తుంది! తను వెంటనే వెళ్ళి, ఆమె నిద్రి స్తున్న గదికి బయటనుంచి గడియ పెట్టాలి. ఆ తర్వాత, నిదానంగా వెళ్ళి రాజుగారిని దర్శించవచ్చు!

ఇలా ఆలోచించిన భూషణం, బండిని వెనక్కు తిప్పించి, ఇల్లు చేరేసరికి, వీధి తలుపు బార్లా తెరచి వున్నది. ఇది చూసి

నిర్ఘాంతపోయి పరుగుపరుగున ఇంట్లోకి పోయేసరికి, ఒక గదికి బయట గడిపెట్టి వున్నది. లోపలినుంచి కనకం కేకలు పెడుతూ తలుపు బాదుతున్నది.

భూషణం తలుపు గడి తీశాడు. కనకం ఆయాసపడుతూ బయటకు వచ్చింది.

"ఏం జరిగింది? యువరాణి ఎక్కడ?" అని అడిగాడు భూషణం ఆదుర్దాగా.

"అది యువరాణి కాదు, దొంగలరాణి! నాకు కొంచెం కునుకు పట్టేసరికి, అది వెళ్ళి వీధి తలుపు తీసింది. ఊళ్ళో అందరికీ తెలిసిన, నీ భోషాణం సంగతి, మనకు గుళ్ళో కనిపించిన గుబురుమీసాలవాళ్ళకూ తెలిసుండాలి. వాళ్ళు, ఆ దొంగలరాణి వెంట వచ్చి, నన్ను భయపెట్టి, నా ఎదుటే ఆ భోషాణాన్ని ఎత్తుకుపోతూ, నన్ను గదిలోకి నెట్టి బయట గడిపెట్టారు," అని చెప్పింది కనకం.

భార్య మాటలు వింటూనే భూషణం కుప్పకూలిపోయాడు. కనకం అతడికి ఒక లోటా మంచి నీళ్ళు తెచ్చి ఇచ్చి, "ఎందుకంత విచారం? భోషాణం వుండీ, మనం కటిక దరిద్రుల్లా బతికాం. ఇప్పుడు కూడా అది పోలేదు, ఇంట్లోనే వున్నదనుకుందాం, సరి పోయె!" అన్నది.

భూషణం, భార్యకేసి కొద్దిసేపు కళ్ళార్పకుండా చూసి, "కనకం! నువ్వు సత్తెకాలపు పతివ్రతవు. ఆస్తంతాపోయె, పుట్టింటికి పోతానంటూ గొడవపెట్టకుండా, అపరంజి బంగారం లాంటి మాటలు అన్నావు. నేను వడ్డీకి తిప్పుతున్న డబ్బు చాలావున్నది. ఇకనుంచి, ఆ వడ్డీతోపాటు అసలు కూడా వసూలు చేసి, ఒక పచారీ దుకాణం, ఒక బట్టల దుకాణం, వీలైతే ఒక నగలదుకాణం కూడా పెట్టి — ఒకటి రెండేళ్ళలో లక్షలు గడిస్తాను," అన్నాడు.

"ఆ లక్షలు దాచేందుకు మరొక భోషాణం కూడా కొంటారా?" అన్నది కనకం.

"ఛీ, ఛీ! ఆ భోషాణాల కాలం గతించి పోయింది. సంపాయించడం ఎందుకు? ఉన్నంతలో సుఖపడడానికేగదా!" అన్నాడు భూషణం నిండుస్వరంతో.

భూషణం అన్నంతపనీ చేశాడు. రకరకాల వ్యాపారాలు ప్రారంభించి, రెండో సంవత్సరం గడిచే లోపల, భూపాలపురంలోని ధనికుల్లో ఒకడయ్యాడు.



**ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు -**
**తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!**

# 11. సావిత్రి సాహస గాథ



ఆరోజు ఆదివారం కావడంతో దేవనాథుడి కొడుకు, కుటుంబంతో కలిసి నగరానికి కొద్ది దూరంలోవున్న కొండప్రాంతానికి చిన్న వినోద యాత్రకు వెళ్ళిరావాలనుకున్నాడు. అయినా ఉదయం ఎనిమిది గంటలకల్లా, ''తాతయ్యా! సావిత్రి కథ వినడానకి ఎప్పుడు రమ్మన్నారు?'' అంటూ దేవనాథుడికి సందీవుడి స్నేహితుల నుంచి ఫోన్లు రాసాగాయి. మన సంస్కృతిని గురించి తెలుసుకోవడానికి పిల్లలు చూపు తూన్న ఆసక్తికి దేవనాథుడు ఎంతగానో సంతో షించాడు. వినోదయాత్ర కార్యక్రమం పైవారం పెట్టుకుంటే బావుంటుందని కొడుక్కు సలహా ఇచ్చాడు. కొడుకూ, కోడలూ అందుకు సంతో షంగా అంగీకరించారు.

సాయంకాలం మూడు గంటలకు పిల్ల లందరూ సందీపుడి ఇంటి ముందున్న పొన్న చెట్టు కిందికి చేరారు. దేవనాథుడు వచ్చి కుర్చీలో కూర్చుని, ''మనకున్న గొప్ప కథలలో ఒకటైన సావిత్రి కథను ఈ రోజు మనం తెలుసు కుందాం. సావిత్రి మద్ర దేశాధిపతి అశ్వపతి కుమార్తె. అవునూ, ఆనాటి మద్రదేశం ఏ ప్రాంతమో మీకు తెలుసా?'' అని అడిగాడు.

''ఇటీవల చెన్నయ్ అంటూన్న మద్రాసా తాతయ్యా?'' అన్నది కిశోర్ చెల్లెలు.

''కాదమ్మా. ఈనాటి ఆఫ్ఘనిస్థాన్‌నే ఆనాడు మద్రదేశం అనేవారు. అలాగే మన పురాణకాలం నాటి గాంధారదేశాన్నే ఇవాళ ఖాందహార్ అంటున్నారు,'' అన్నాడు దేవ నాథుడు.

''అలాగా! అంటే అవన్నీ భారతదేశంలో భాగాలన్నమాటేగా?'' అని అడిగాడు కిశోర్.

''చాలా ముఖ్యమైన ప్రశ్న అడిగావు. దీనిని అర్థం చేసుకోవాలంటే మొదట మన ప్రాచీన రాజకీయ-భౌగోళిక స్వరూపం గురించి తెలుసు కోవాలి. భారత ఉపఖండాన్ని జంబూద్వీపం అనేవారు. జంబూద్వీపంలో అనేక రాజ్యా లుండేవి. ఒక విధమైన సాంస్కృతిక ఆధ్యా త్మిక బంధం వీటన్నిటినీ కలిపి వుంచింది. ఈ

ి - చరిత్ర






రాజ్యాలన్నీ ఒక్కటే అనే భావం అప్పటి ప్రజలలో ఉండేది. అందువల్లే కురుపాండవ యుద్ధంలో — అటు కౌరవుల పక్షమో, ఇటు పాండవుల పక్షమో వహించి, ఉపఖండంలోని రాజ్యాలన్నీ పాల్గొన్నాయి. ఒక రాజ్యంలో పుట్టే, గొప్ప భావం, ఉన్నత ఆలోచనాతరంగం ఇతర రాజ్యాలకు వ్యాపించేవి. పెషావర్, కాబూల్, బామియాన్‌లు బౌద్ధవిద్యాకేంద్రాలుగా ఉండేవి. బామియన్‌లో అతిపెద్ద బుద్ధవిగ్రహాలు ప్రతిష్ఠించబడ్డాయి. చెంఘిజ్‌ఖాన్ వంటి దురాక్రమణదారులు వాటిలో చాలావాటిని నేలమట్టం చేశారు. అయినా, ఇవన్నీ చరిత్రకు సంబంధించిన విషయాలు. నేను ఇప్పుడు మీకు సావిత్రి కథ కదా చెప్పాలి? ఈ కథను పాండవులు వనవాసం చేస్తూన్నప్పుడు మార్కండేయముని వారికి మొట్టమొదట చెప్పాడు,'' అంటూ సావిత్రి కథను ప్రారంభించాడు :

మద్ర దేశాధిపతి అశ్వపతి ఏకైక సంతానం సావిత్రి. సావిత్రీదేవి వరప్రసాదంగా జన్మించిన సావిత్రి అద్భుతసౌందర్యరాశి. అంతకుమించిన సుగుణాలవెల్లి. ఆమె ముఖారవిందం దివ్య తేజస్సుతో వెలిగిపోయేది.

ఆమె యుక్తవయస్కురాలు కాగానే తండ్రి వరుడి కోసం అన్వేషణ ప్రారంభించాడు. కాని, వచ్చిన రాజకుమారులెవరూ ఆమె మోముకేసి తేరిపార చూడలేకపోయారు. అందువల్ల ఆమెనే స్వయంగా వెళ్ళి వరుణ్ణి ఎంపిక చేసుకోమని తండ్రి ఆదేశించాడు.

వివేకవంతులైన మంత్రులు వెంటరాగా, ఆమె అందమైన రథంలో వివిధ రాజ్యాలు తిరిగి, ఆఖరికి సాల్వరాజ్య సరిహద్దుకు, అంటే ఇప్పటి రాజపుతానా ప్రాంత అరణ్యాన్ని చేరింది. అక్కడ సాల్వరాజు ద్యుమత్సేనుడి కుమారుడైన సత్యవంతుణ్ణి చూసింది. ద్యుమత్సేనుడు హఠాత్తుగా చూపుకోల్పోయాడు. ఆ కారణంగా దుర్మార్గుల కుట్రవల్ల రాజ్యాన్ని పోగొట్టుకుని అరణ్యంలో మునుల మధ్య కాలం గడుపుతున్నాడు. సత్యవంతుడు తల్లి తండ్రులకు అమితభక్తిశ్రద్ధలతో పరిచర్యలు చేస్తున్నాడు.

ఆమె సత్యవంతుణ్ణి వివాహమాడాలని నిర్ణయించింది. తన నిర్ణయాన్ని తల్లిదండ్రులకు తెలియజేయడానికి సంతోషంగా మద్రపురికి చేరింది. సావిత్రికి రాజభవనంలో నారద ముని కనిపించాడు. సత్యవంతుడు మరొక్క సంవత్సరంలో మరణించగలడని నారద ముని చెప్పాడు. ఆ మాట విని సావిత్రీ, ఆమె తల్లి తండ్రులూ విచారగ్రస్తులయ్యారు.

ఆ వరుడు వద్దని అశ్వపతి కుమార్తెకు నచ్చ చెప్పడానికి ప్రయత్నించాడు. అయితే మన



సారా వరించిన సత్యవంతుణ్ణి తప్ప మరెవ్వరినీ వివాహమాడనని సావిత్రి పట్టుపట్టింది.

తన కుమార్తె సాధారణ స్త్రీ కాదనీ, విధిని ఎలా ఎదుర్కోవాలో ఆమెకు తెలుసుననీ గ్రహించిన అశ్వపతి, ఆమె ఇష్టానుసారమే సత్యవంతుడికిచ్చి వివాహం జరిపించాడు.

సావిత్రి తమ కుటీరానికి రాగానే ద్యుమత్సేనుడూ, ఆయన భార్యా అమితానందం చెందారు. భర్తకూ, అత్తమామలకూ పరిచర్యలు చేస్తూ, పెద్దలపట్ల వినయవిధేయతలతో నడుచుకోవడం వల్ల సావిత్రి పట్ల అందరికీ ఆదరాభిమానాలు పెరిగాయి.

అయితే సావిత్రి మాత్రం మనశ్శాంతితో ఉండలేకపోయింది. జీవితంలో ఆమెకు ప్రాణ సమానం, భర్త సత్యవంతుడి సాహచర్యం. అతన్నే విధి కబళించనున్నదన్న కఠోర సత్యాన్ని ఆమె క్షణం కూడా మరువలేకపోయింది. ఆ రోజును ఎదుర్కోవడానికి తన్నుతాను సిద్ధం చేసుకోవాలి!

ఆమె మౌనంగా భక్తితో, ధ్యానంతో తనలో ఆత్మశక్తిని పెంపొందించుకోసాగింది. ఆఖరికి సత్యవంతుడు మరణిస్తాడని నారదుడు చెప్పిన రోజు రానే వచ్చింది!

ఆ రోజు ఉదయం సమిధల కోసం అడవికి బయలుదేరిన సత్యవంతుడి వెంట సావిత్రి కూడా వెళ్ళింది. మధ్యాన్నం అయ్యేసరికి సత్యవంతుడికి తల తిరుగుతున్నట్టనిపించింది. సావిత్రి తొడమీద తలపెట్టి పడుకున్నాడు. ఏం జరుగనున్నదో సావిత్రికి తెలుసు. మనసులో దైవాన్ని స్మరిస్తూ నిశ్చలంగా అలాగే కూర్చున్నది.

కొంతసేపటికి ఆమె ఎదుట ఎర్రటి కళ్ళతో ఒక దివ్యస్వరూపుడు కనిపించాడు. అతడు యమధర్మరాజని ఆమె గ్రహించింది. సత్యవంతుడి శరీరం నుంచి ఆత్మను తీసుకుని యముడు ముందుకు నడిచాడు.

సావిత్రి యముణ్ణి వెంబడించి వెళ్ళింది. ఆమె అద్భుతశక్తిసామర్థ్యాలను చూసి యముడు ఆశ్చర్యానందాలు పొందాడు. ''ఎందుకమ్మా నావెంట వస్తున్నావు? నీ భర్త ప్రాణం తప్ప మరేదైనా వరం కోరుకుని వెనుదిరిగి వెళ్ళు,'' అన్నాడు. తన మామగారికి పోయిన చూపూ, రాజ్యమూ తిరిగి రావాలని కోరుకున్నది సావిత్రి. ''అలాగే!'' అన్నాడు యముడు.

అయినా సావిత్రి తిరిగివెళ్ళలేదు. యముణ్ణి వెన్నంటి ప్రార్థిస్తూ వెళ్ళింది.

యముడు కనికరించి మరి రెండు వరాలు కోరుకోమన్నాడు.

తాను జీవితాంతం సత్యవంతుడికి సహధర్మచారిణిగా ఉండాలనీ, అతని బిడ్డకు తల్లి కావాలనీ కోరుకున్నది.

యముడు ''అలాగే!'' అని వరాలిచ్చాడు. సత్యవంతుడు సజీవుడైతే తప్ప ఈ రెండు

వరాలూ సిద్ధించే అవకాశం లేదు. సమయ స్ఫూర్తితో తెలివిగా సావిత్రి వరాలు కోరుకోవడం వల్ల, యముడికి ఆమె భర్త ప్రాణాలు తిరిగి ఇవ్వక తప్పలేదు!

సత్యవంతుడు నిద్రమేల్కొన్నట్టు లేచి కూర్చు న్నాడు. ఇద్దరూ కలిసి కుటీరానికి వెళ్ళారు. ద్యుమత్సేనుడు కొడుకునూ, కోడలినీ చూసి అమితానందంతో ఆశీర్వదించాడు. అప్పటికే ఆయన చూపు తిరిగివచ్చింది. అంతవరకు రాజ్య సింహాసనాన్ని ఆక్రమించిన దుర్మార్గుణ్ణి, విశ్వాసపాత్రులైన ప్రజలు హతమార్చడంతో, రాజ్యాధికారాన్ని మళ్ళీ చేపట్టమని ఆహ్వా నించడానికి మంత్రులూ, రాజోద్యోగులూ అక్క డికి వచ్చారు!

''మహాభారతం చెప్పే సావిత్రి సత్య వంతుల కథ క్లుప్తంగా ఇది. అయినా ఇది చాలా గొప్ప కథ అని నేను ఎందుకు చెప్పానో తెలుసా? ఈ కథలో కొన్ని ప్రగాఢ సత్యాలు దాగి ఉన్నాయి. సావిత్రి తన ఆత్మశక్తితో భర్త నుదుటి రాతను తిరగరాసింది. ఆమె భర్త నిజంగానే సత్యవంతుడు. భార్యాభర్తలిద్దరూ పవిత్ర స్వభా వులే. శ్రీ అరవిందులు గనక సావిత్రి మహా కావ్యరచన చేయలేదంటే ఈ కథలోని అంత రార్థాలు మనకు తెలిసి ఉండేవి కావు. ఒక పురాతన గాథను ఆయన 'మహోన్నత ప్రతీక' స్థాయికి తీసుకువెళ్ళాడు.

ఒక వ్యక్తి నిర్మల పవిత్రప్రేమ మరొక వ్యక్తి నుదుటిరాతనే మార్చగలిగిందికదా! మరి మును ముందు వికసించనున్న దివ్య ప్రేమ, మానవ జాతి గమనాన్ని, గమ్యాన్ని మార్చితీరుతుం దనడంలో సందేహం లేదు. అందుకోసం మనిషి సత్యమార్గంలో పయనిస్తూ, ఉన్నతశిఖరాలకు ఎదిగి ఆ స్థాయిని అందుకోవడానికి తగిన అర్హ తను సంపాయించుకోవాలి — అన్న విషయం మరచిపోకూడదు!'' అని ముగించాడు దేవ నాథుడు.

''తాతయ్యా! మీరు 'సావిత్రి'ని మాకు చదివి వినిపించవచ్చుకదా?'' అన్నది శిరీష అనే అమ్మాయి.

''పెరిగి పెద్దవాళ్ళయ్యాక, మీరే స్వయంగా ఆ గొప్ప గ్రంథాన్ని చదువుకోవాలి. కాదు... కాదు. ఇప్పుడు కూడా మీరా పుస్తకం చదవడం ఆరంభించవచ్చు. అర్థంకాకపోయినా ఫరవా లేదు. అది మీ మనసుల మీద అద్భుతప్రభావం చూపుతుంది. అదొక గొప్ప అనుభవం! ఉన్నత కవిత్వం ఎలా వుంటుందో మీకు తెలియ వస్తుంది.'' అంటూ లేచి నిలబడ్డాడు దేవ నాథుడు. — (ఇంకావుంది)



## ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

# బాబు రాజేంద్రప్రసాద్

స్వతంత్ర భారతదేశ ప్రథమ అధ్యక్ష పదవిని అలంకరించిన బాబు రాజేంద్ర ప్రసాద్ 1884 డిసెంబర్ 3వ తేదీ బీహార్‌లో జన్మించారు.

కలకత్తా విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం పూర్తిచేశాక ఆయన పాట్నాకు వెళ్ళి, న్యాయవాద వృత్తిని చేపట్టారు. అతి త్వరలో ఆయన అక్కడి ఉన్నత న్యాయస్థానంలోని ప్రముఖ న్యాయవాదులలో ఒకరయ్యారు. అయితే, ఆయన మనసంతా పరాయిపాలన కింద నానా బాధలు అనుభవిస్తున్న మాతృదేశ విముక్తి మీదే ఉండేది. 1917వ సం॥లో బీహార్‌లోని చంపారన్‌లో సత్యాగ్రహం నిర్వహించడానికి వచ్చిన మహాత్మా గాంధీని ఆయన సందర్శించారు. ఆ తరవాత ఆయన న్యాయవాదవృత్తికి స్వస్తిచెప్పి సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్నారు.



క్రమంగా ఆయన రాజకీయరంగంలో ఎదిగి 1922వ సం॥లో భారత జాతీయ కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి అయ్యారు. దక్షతగల నేతగా అందరి ఆదరాభిమానాలకూ పాత్రుడయ్యారు. ఆ కారణంగా ఆయన 1934, '39, '47 సంవత్సరాలలో మళ్ళీ మళ్ళీ కాంగ్రెస్ అధ్యక్షుడిగా నియమించబడ్డారు.

స్వతంత్ర భారతదేశానికి కావలసిన రాజ్యాంగ శాసనాన్ని రచించడానికి 1946వ సం॥లో 'రాజ్యాంగ పరిషత్తు' ఏర్పాటయింది. దానికి రాజేంద్రప్రసాద్ అధ్యక్షులుగా నియమితులయ్యారు. మన రాజ్యాంగ నిర్మాణంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు.

1947వ సం॥లో జవహర్‌లాల్ నెహ్రూ ఏర్పాటుచేసిన మంత్రిమండలిలో ఆయన మంత్రి అయ్యారు. 1950వ సం॥లో నూతన రాజ్యాంగం అమలులోకి రాగానే ఆయన భారత రిపబ్లిక్ తొలి అధ్యక్షులు (రాష్ట్రపతి)గా ఎన్నుకోబడ్డారు. ఆ అత్యున్నత పదవికి ఆయన 1952 '57 సం॥లలో ఎన్నుకోబడి, '62 సం॥ వరకు ఆ పదవిని నిర్వహించారు.

రాష్ట్రపతి అయిన తరవాత కూడా ఆయన సామాన్య ప్రజలతో ఉన్న సంబంధ బాంధవ్యాలను కొనసాగించారు. దేశంలోని వివిధ ప్రాంతాలను రైలులో పర్యటిస్తూ, చిన్న చిన్న స్టేషన్లలో కూడా ఆగి, దారి పక్కన గుమిగూడే సాధారణ ప్రజల నుద్దేశించి ఉపన్యసించేవారు. వారి బాగోగులను గురించి తెలుసుకునేవారు.

1962వ సం॥లో పదవీ విరమణ చేశారు. భారత ప్రభుత్వం ఆయనన్ను 'భారత రత్న' పురస్కారంతో సత్కరించింది. 1963 ఫిబ్రవరి 28వ తేదీ పాట్నాలో ఆయన కీర్తిశేషులయ్యారు. రాజన్‌బాబు స్మృతికి నివాళిగా ఒక మాట చెప్పమని కవయిత్రి సరోజినీనాయుడును అడిగినప్పుడు ఆమె ఇలా అన్నారు : "అందుకు కడివెడు తేనెతో నింపిన బంగారు కలం కావాలి. ఎందుకంటే రాజన్‌బాబు గుణగణాలను వివరించాలన్నా, ఉన్నత గుణాలకు నివాళి అర్పించాలన్నా మనకున్న మాటలు చాలవు!"

చందమామ కానుక

పరోపకారి చిన్నడు

# పిశాచి నాటకం - 1

చిత్రాలు : పాణి



మంగాపురంలోని మంగయ్యశెట్టి అనే వడ్డీవ్యాపారి, అంతులేని ధనం కూడబెట్టి, తన కొడుకు గోవిందశెట్టికి అప్పగించి కన్నుమూశాడు. గోవిందశెట్టి ఇనుపపెట్టె తీసి ఆ ధనాన్ని చూసి పట్టలేనంతగా సంతోషించాడు.






ఆ ధనాన్నంతా రెండు లంకెబిందెలలో పోసి, రాత్రి వేళ ఎవరూ చూడకుండా తీసుకుపోయి ఊరి బయటవున్న దయ్యాలమర్రి కింద పాతిపెట్టాడు.




ఆ మర్రి చెట్టుమీద దయ్యాలుంటాయన్న నమ్మకం వల్ల, రాత్రివేళ ఎవరూ ఆ చాయలకు వెళ్ళరు.




అతడు తెల్లబట్టలు ధరించి పిశాచివేషం వేసుకుని, కాళ్ళకు గజ్జలు కట్టుకుని వింత వింత ధ్వనులు చేస్తూ మర్రిచెట్టుకింద మసలేవాడు. అందువల్ల ఎవరైనా అక్కడికి వస్తే హడలిపోయి పరిగెత్తేవారు.


రాత్రి అంతా అలా తిరిగి అతడు తెల్లవారు జామున ఇల్లు చేరేవాడు.
ఆహా!... ఎవరూ చూడలేదు!


మఱ్రిచెట్టు కింద దయ్యం లాంటిది తారట్లాడు తున్నట్టుంది.
అవును! దయ్యం లాగే వుంది.
నిజమే, మీరేకాదు, దానిని గురించి చాలామంది చెప్పారు! ఏం చేయడం?


మఱ్రిచెట్టు మీద పిశాచం గురించి విన్నారా?
మఱ్రి చెట్టు మీదున్నాడా?
"చనిపోయిన మా నాన్న పిశాచమై మఱ్రిచెట్టును ఆశ్ర యించాడు."


దయ్యం! పిశాచం! కాపాడండి!
ఆ దెబ్బతో మఱ్రిచెట్టు దరిదాపులకు రావడా నికే గ్రామస్థులు భయ పడసాగారు.


చీకటిపడితే చాలు, గడపదాటి బయటకు రావడానికి జడుసుకునేవారు.
PRANI


భయపడకండి ఇక్కడ పిశాచం లేదు! లేవండి! జ్వరం తగ్గింది! ఏమైనా తింటారా?
పిశాచం వెళ్ళి పోయిందా?







ఊళ్ళో ఏ మనిషికిగాని, గొడ్డుకుగాని జబ్బు చేసినా, చావు వచ్చినా అది పిశాచం పని అనే అందరూ నమ్మారు. భూత వైద్యులు పెరిగారు. గ్రామజీవితం అస్తవ్యస్తమయింది.






గ్రామంలో దరిద్రం తాండవించడం కూడా గోవిందశెట్టికి లాభించింది. తనవద్ద వున్న సరుకులను హెచ్చు ధరలకు అమ్మి మరింత లాభాలు చేసుకోసాగాడు.


అయినా, రాత్రుల్లో గోవిందశెట్టి పిశాచివేషంతో మర్రి చెట్టుకింద కాపలా కాస్తూనే వచ్చాడు.


ఎందుకలా భయపడి పోతున్నారు?
బాబూ ఇక్కడ ఎవరికీ క్షేమం కాదు!
పిశాచం ఒకటి ప్రాణాలు తీస్తున్నది!
ఈ స్థితిలో చిన్నడు తన కుక్క భైరవంతో సహా ఆ గ్రామం చేరాడు. మంగయ్యశెట్టి పిశాచం గురించీ, దానివల్ల గ్రామానికి దాపురించిన అరిష్టాల గురించీ తెలుసుకున్నాడు.


జనానికి పిశాచాల భయం లేకుండా చేస్తే తప్ప, వాళ్ళ జీవితాలు బాగుపడవని ఆలోచించిన చిన్నడు మంగయ్యశెట్టి పిశాచాన్ని చూడ డానికి పథకం వేశాడు. ఆ రాత్రి నిర్జనంగా ఉన్న దయ్యాలమర్రిని చేరి, దాని మీద ఎక్కి కొమ్మల మధ్య కూర్చున్నాడు.


అర్ధరాత్రి సమయంలో గోవిందశెట్టి చెట్టుకిందికి రావటమూ, పిశాచి వేషం వేసుకోవటమూ, చెట్టుకింద తార ట్లాడటమూ చిన్నడికి కనిపించింది.
''ఎవడో మంగయ్యశెట్టి పిశా చంలా నటిస్తూ, ప్రజలను భయభ్రాంతులను చేస్తు న్నాడు. ఇందులో వాడి స్వార్థం ఉండాలి. స్వార్థం కోసం ప్రజలను బాధలకు గురిచేస్తూన్న ఆ కిరాతకుణ్ణి ప్రజలముందుకు లాగాలి.''

తెల్లవారుజామున చిన్నడు గోవిందశెట్టి వెనకగా వెళ్ళి అతడి ఇంటిని కనిపెట్టి, అతన్నిగురించి ఆరా తీశాడు.





ఇరుగు పొరుగు ఇళ్ళకు వెళ్ళి గోవింద శెట్టి వివరాలు సేకరించాడు.







ఆ రోజు కనుచీకటివేళ చిన్నడు పొడవాటి గడ్డమూ, మీసాలూ పెట్టుకునివెళ్ళి గోవిందశెట్టి ఇంటి తలుపు తట్టాడు.

ఇంకావుంది....




# కనువిప్పు

దీప్తిగిరిని, పూర్ణవర్మ అనే రాజు పాలించేవాడు. ఆయన మితిమించిన అహంభావి. తనకు ఏది తోస్తే అది సరి అయినదని భావించేవాడు. ఎదుటివారిని ఏమాత్రం లెక్కచేసేవాడు కాదు. ఇతరుల సలహాలను పెడచెవిని పెట్టేవాడు. ఆయనలో వుండే మరొక వింత గుణం ఏమంటే — తన రాజ్యంలో వున్న విశిష్ట వ్యక్తులను, మేధావులను మెచ్చుకొనక చులకన చేసి మాట్లాడేవాడు. అదే ఇరుగుపొరుగు రాజ్యాల నుంచి లేదా దూరదేశాల నుంచి వచ్చిన కవి, పండితులను, గాయకులను ఎంతగానో శ్లాఘించేవాడు ; గౌరవించి బహుమానాలతో సత్కరించేవాడు.

ఈ కారణాల వల్ల, దీప్తిగిరిలోని సమర్థులైన ఎందరో కవులు, గాయకులు, కళాకారులు, శిల్పులు, తమకు దీప్తిగిరిలో ఏమాత్రం గుర్తింపు లేదన్న నిరుత్సాహంతో పరదేశాలకు వలసపోసాగారు.

ఇలా వుండగా, ఒకరోజున చేనేతలో ప్రవీణుడైన రవిచంద్రుడనేవాడు, రాజు పూర్ణవర్మను దర్శించి, తనకు చేనేతలో గొప్ప ప్రావీణ్యం వున్నదని విన్నవించుకున్నాడు.

''నీది ఏ రాజ్యం?'' అని ప్రశ్నించాడు పూర్ణవర్మ.

''నాది కలువగిరి, ప్రభూ!'' అన్నాడు రవిచంద్రుడు.

రాజు ఉత్సాహంగా, ''అలాగా! చేనేతలో నీ ప్రత్యేకత ఏమిటో చెప్పు, వింటాను,'' అన్నాడు.

అప్పుడు, రవిచంద్రుడు తన భుజానికి తగిలించుకున్న సంచి కిందపెట్టి, అందులో వున్న ఒక వెండి భరిణలోనుంచి, అతి పలచని వస్త్రాన్ని బయటకు తీసి, ''ప్రభూ! ఇది మూడు గజాల పొడవు, ఒకటిన్నర గజం వెడల్పుగల ఒక పట్టు పీతాంబరం. ప్రభువులు క్షమించండి. ఇది ఆత్మస్తుతి అనుకోకండి. ఇంతపెద్ద వస్త్రాన్ని, పిడికెడంత

రాఘవరాజు పట్టాభిరామరాజు

భరిణెలో ఇమడ్చడం, నేతలో అద్భుతమైన నా నైపుణ్యానికి నిదర్శనం కాదా!'' అన్నాడు.

పూర్ణవర్మ మందహాసం చేసి, ''రవిచంద్రా! నేతపనిలో నీ నైపుణ్యం చాలా అద్భుతం! ఈనాటి నుంచి నువ్వు, మా ఆస్థానంలో వుండిపో. నెలకు వెయ్యిరూపాయల జీతంతో పాటు, ఉచిత నివాసం కూడా కల్పిస్తాను. మా రాచకుటుంబీకులకు, పండుగలకూ, ఇతరత్రా శుభకార్యాలకూ వస్త్రాలు నేయడం, నీ పని!'' అన్నాడు.

రాజు ఔదార్యానికి, రవిచంద్రుడు ఉబ్బి తబ్బిబ్బయి, ''చిత్తం, ప్రభూ!'' అంటూ చేతులు జోడించాడు.

ఒక నెల గడిచాక, రాజు పూర్ణవర్మ, మంత్రి రుచితశర్మ మారువేషాలతో గుర్రాల మీద దేశాటనకు బయల్దేరారు. రాత్రివేళ చిన్న చిన్న గ్రామాల్లో విడిది చేస్తూ, వారం రోజుల తర్వాత, తమ రాజ్యసరిహద్దులు దాటి కలువగిరి చేరుకున్నారు. ఆసరికి బాగా చీకటి పడడంతో, వాళ్ళు ఒక సత్రంలో దిగి, భోజనాలు ముగించి, కాలక్షేపానికి సత్రం బయటకు వచ్చారు.

అక్కడ ఒక వ్యక్తి, పెద్ద గొంతుతో, ''నాణ్యమైన వస్త్రాలు, బాబూ! కారు చౌక. నాణ్యత చూసి నచ్చితేనే కొనండి,'' అంటున్నాడు, నూనెదీపం వత్తి ఎగదోస్తూ.

అతడి చుట్టూ జనం మూగి వస్త్రాలను ఖరీదు చేస్తున్నారు.

రాజూ, మంత్రీ వస్త్రాల నాణ్యతను పరీక్షించసాగారు. ఇంతలో జనం మధ్య నుంచి సంపన్నుడిలా వున్న ఒకతను ముందుకు వచ్చి, ''ఇలా మామూలు వస్త్రాలు కాకుండా,



నీదగ్గర ప్రత్యేకంగా, విలక్షణంగా వుండే వస్త్రా లేమైనా వుంటే చూపించు!'' అన్నాడు.

''ఒక్కక్షణం ఓపిక పట్టండి,'' అని, నేతగాడు పక్కన వున్న మూటలోంచి, ఒక దంతపు భరిణె తీసి, ''బాబూ! ఇందులో నాలుగు గజాల పొడవూ, రెండు గజాల వెడల్పూ వున్న రెండు పట్టు పీతాంబరా లున్నవి,'' అంటూ వాటిని బయటకు తీసి చూపించి, ''వీటి ఖరీదు కేవలం ఇరవై వరహాలు మాత్రమే!'' అన్నాడు.

సంపన్నుడు, నేతగాడికి డబ్బిచ్చి వస్త్రాలు తీసుకుని పోబోతూ ఆగి, ''నువ్వీ రాజ్యం వాడివేనా''? అని అడిగాడు.

''కాదు బాబూ! దీప్తిగిరిరాజ్యం వాణ్ణి,'' అన్నాడు నేతగాడు.

ఆ జవాబుకు సంపన్నుడు ఆశ్చర్య పోయి, ''ఇంత నైపుణ్యం వుండి కూడా, రాజ్యం వదిలి ఇక్కడికి వలస వచ్చావా?'' అన్నాడు.

అందుకు వాడు దిగులుగా ముఖం పెట్టి, ''మారాజుగారిది చాలా వింతప్రవృత్తి. తన దేశంలోని ప్రముఖవ్యక్తులను గుర్తించ లేని అంధత్వం ఆయనది. ఆయన దర్శనం కోసం ప్రయత్నించి విఫలమయ్యాను. కావలి భటులు అనుమతించలేదు. స్వదే శస్థుడు ఎంతటి మేధావీ, కళాకారుడూ అయినా రాజదర్శనం లభించదు; ఇతర దేశస్థులమని చెప్పుకోవాలి. అలా చెప్పి రాజ దర్శనం సంపాయించినా, ఒక వేళ నిజం బయట పడితే కారాగృహంపాలు కావలసి వస్తుంది. అందువల్లనే విధిలేక, ఇలా పరాయి దేశంలో వీధినపడవలసివచ్చింది,'' అన్నాడు.

ఆ జవాబు వింటూనే, రాజు పూర్ణవర్మ ముఖం వెలవెలపోయింది. ఆయన తల వంచుకుని మంత్రితోపాటు సత్రానికి తిరిగి వచ్చాడు.

నేతగాడి సమాధానం రాజుకు కనువిప్పు కలిగించింది.

ఆ మర్నాడు సూర్యోదయంతోనే రాజ ధానికి బయల్దేరిన రాజు, రాజధాని చేరు తూనే, రానున్న దసరా పండుగనాడు, రాజ్యం లోని కవి, పండితులకూ, కళాకారులకూ ఘనంగా సన్మానం జరపనున్నట్టు, రాజ్య మంతటా చాటింపు వేయించాడు.





# భయం ఎరగనివాడు

ఒకానొక కారడవిలో, మంత్రాలమరిడి అనే మంత్రగత్తె వుండేది. అది మహా క్రూరురాలు. అడవిగుండా ప్రయాణించే వాళ్ళను భయపెట్టి ప్రాణాలు తీసి పరమానందం చెందేది. అది వుండే పెద్ద గుహ, అది భయపెట్టి చంపిన వాళ్ళ అస్థిపంజరాలతో నిండిపోయింది. రాత్రివేళ వాటి మధ్య పడుకుంటే తప్ప, మంత్రాలమరిడికి నిద్ర పట్టేది కాదు.

ఏడాది క్రితం, ఆ కారడవికి కొద్దిదూరంలో వున్న గ్రామంలో వుండే రామభద్రుడనే యువకుడు, అడవిలో వేటకు పోయి, ఈ మంత్రాలమరిడివల్ల ప్రాణాలు పోగొట్టుకున్నాడు. ఆ తర్వాత, గ్రామస్థులెవరూ అడవికి పోవడం మానుకున్నారు.

రామభద్రుడికి, వీరభద్రుడనే అన్న వున్నాడు. వాడికి గ్రామంలో భయమంటే ఎరగనివాడన్న పేరుండేది. ఈ మంత్రాలమరిడి అంతం చూడాలని, ఒకనాడు అది వుండే కారడవి ప్రాంతానికి బయలుదేరాడు.

వీరభద్రుడు, మంత్రాలమరిడి వుండే స్థావరాన్ని చేరే సమయంలో, అది గుహ ముందున్న ఊడలమర్రి కింద కూర్చుని, ఈ మధ్య మనుష్యులెవరూ తనకేసి రావడం లేదన్న విచారంలో మునిగివున్నది. అంతలో దానికి, తనకేసి వస్తున్న వీరభద్రుడు కనిపించాడు. దాని మిడిగుడ్లు మెరిశాయి.

వీరభద్రుడు, మంత్రగత్తెను సమీపించి, ''పెద్దమ్మా, బావున్నావా?'' అని అడిగాడు.

మరిడి మిడిగుడ్లు మెరిపిస్తూ, ''బావుండబట్టేగదరా, పగలే చీకటిగా వుండే, ఈ ఊడలమర్రి కింద కూర్చున్నాను. సరే, మనవడా, ఇంతకీ నీ ప్రయాణం ఎక్కడికి?'' అని అడిగింది.

''ఏం చెప్పను, పెద్దమ్మా! నా పేరు వీరభద్రుడు. అందరూ నన్ను భయం ఎరగని వీరభద్రుడంటారు. బళ్ళో గురువులు నాకు అన్ని విద్యలూ నేర్పారు కానీ, భయమంటే

ఎస్. శివనాగేశ్వరరావు



ఏమిటో నేర్పలేదు. ఈ మధ్య కొన్నాళ్ళుగా, నన్ను భయపెట్టగలిగేవాళ్ళకోసం వెతుకు తున్నాను. ఒక్కగానొక్కడూ కనిపించలేదు,'' అన్నాడు వీరభద్రుడు.

''అలాగా, మనవడా! అయితే, నువ్వు రావలసిన చోటుకే వచ్చావు. త్వరలోనే, నీకు ఈ లోకం నుంచి, పైలోకానికి దారి చూపు తాను,'' అన్నది మరిడి పట్టరాని సంతో షంతో వికవికా నవ్వుతూ.

''నన్ను కేవలం భయపెట్టే పైలోకానికి పంపుతావా, పెద్దమ్మా? మహబాగు! నేను, మంత్రాలమరిడమ్మంటే చూడ భయంకరంగా వుంటుందనుకున్నాను. కాని అందమైన రూపంతో, ముగ్గుబుట్టలాంటి తలతో చూడ ముచ్చటగా వున్నావు,'' అన్నాడు వీరభద్రుడు.

ఆ మాటలకు మరిడి మురిసిపోతూ, ''నువ్వు చెప్పేది నిజమా! నేనంత అందంగా వున్నానా?'' అని అడిగింది.

''నే చెప్పేది నమ్మకపోతే, నీ అందాన్ని ఈ అద్దంలో చూసుకో,'' అని వీరభద్రుడు, మరిడికి సంచీలోంచి అద్దం తీసి ఇచ్చాడు.

ఆ అద్దంలో ముఖం చూసుకున్న మంత్ర గత్తెకు, నిజంగానే తను అందగత్తెనని పించింది.

''మనవడా, నువ్వు చెప్పింది గడ్డునిజం. ఇంతకాలానికి నా అందం నాకు తెలిసి వచ్చేలా చేశావు. మెచ్చాను. నీకు మంచి భోజనం పెడతాను,'' అన్నది మరిడి.

''భోజనం సంగతి తరవాత. ముందు నన్ను భయపెట్టగలవేమో చూడు,'' అన్నాడు వీరభద్రుడు.

''ఒరే, అమాయకుడా! నేను భయపెడితే నిలువునా చచ్చిపోతావు. నా అందం మెచ్చు కున్నావు కనక, నిన్ను చంపబుద్ధవడం లేదు,'' అన్నది మంత్ర లమరిడి మురిపంగా.

''ఓస్, నన్ను భయపెట్టడం, నీవల్ల కాదని తెలిసిపోయింది. నేనిక వెన్ను చూపు తాను,'' అంటూ వీరభద్రుడు పెద్దగా నవ్వాడు.

''ఒరే, ఒరే, అల్పాయుష్కుడా, ఆగాగు! ఒకసారి నావెంటరా,'' అని మరిడి, వీర భద్రుణ్ణి తన గుహలోకి తీసుకుపోయింది.

గుహ గోడకు ఆనించివున్న చాలా అస్థి పంజరాలు వీరభద్రుడికి కనిపించాయి. 'అయ్యో నా తమ్ముడు రామభద్రుడి అస్థి పంజరం వీటిలో ఒకటన్నమాట!' అని మన సులో అనుకుంటూ, వీరభద్రుడు కళ్ళు తుడుచుకున్నాడు.

అంతలో మంత్రాలమరిడి కీచుగొంతుతో, ''అరే ఒరే, మనవడా! వీళ్ళల్లోనేను ఏ ఒక్కణ్ణీ

విషం పెట్టిగాని, ఏ కత్తితోనో పొడిచిగాని చంపలేదు. అలా నా భయంకరరూపం చూడగానే కళ్ళు తేలేశారు, నిజం. ఈ అస్థి పంజరాలన్నిటిమీదా ఒట్టు!'' అన్నది.

''వీళ్ళందరూ కుందేటి గుండె గాళ్ళయి వుంటారు. నాదలా కాదు. కొదమసింగం గుండె''! అన్నాడు వీరభద్రుడు.

ఆ మాటకు మంత్రగత్తె కళ్ళెర్ర చేసి, ''చావడానికి తెగతొందరపడిపోతున్నావురా, మనిషీ!'' అని ఏదో మంత్రం చదివింది.

ఆ మరుక్షణం మంత్రగత్తె తల పులి తలగా మారింది. శరీరం రాబందు పక్షిలా మారి రెక్కలు మొలుచుకొచ్చాయి. ఆ భయంకర రూపంతో అది వీరభద్రుణ్ణి, తన బలమైన కాలిగోళ్ళతో వడిసిపట్టుకుని రివ్వున ఆకాశంలోకి ఎగిరింది. అలా కొద్దిసేపు ఆకాశంలో ఎగిరి, తిరిగి కిందికి దిగి, మరొక మంత్రం సహాయంతో మామూలు మంత్రగత్తె రూపం తెచ్చుకున్నది.

వీరభద్రుడు నిక్షేపంలా వున్నాడు. మంత్రాలమరిడి తన మిడిగుడ్లను గుండ్రంగా తిప్పుతూ, ఆశ్చర్యంగా, ''ఒరే, ఇంకా బతికే వున్నావా? ఈపాటికి చచ్చిపోయి వుంటావనుకున్నాను,'' అన్నది.

''నీ పగటి వేషానికి భయపడతానను కున్నావా, మంత్రాలమరిడమ్మా! నీ వేషం వల్ల కాసేపు అలా ఆకాశంలో తిరగ్గలిగాను,'' అన్నాడు వీరభద్రుడు.

తన భయంకరాకారం, వీరభద్రుడికి భయం కలిగించనందుకు, మంత్రాలమరిడికి ఒళ్ళుమండింది. అది చిర్రుబుర్రులాడుతూ మరొక మంత్రం చదవబోయింది.



అంతలో వీరభద్రుడు, ''చూడబోతే నీకు చాలా మంత్రాలు వచ్చినట్టుంది. నన్ను ఈసారి కూడా భయపెట్టి ప్రాణాలు తీసి అస్థిపంజరాల్లో కలపలేకపోతే, నాకేదో ఒక మంత్రం నేర్పాలి!'' అన్నాడు.

''నీవు ఈసారి చావకుండా బతికుంటే, అలాగే నేర్పుతాను, అందుకు ఈ ఊడల మర్రే సాక్ష్యం!'' అన్నది మంత్రగత్తె.

ఈ సారి మంత్రగత్తె, అస్థిపంజరంలా మారింది. అందులోంచి చాలా పాములు బుసకొడుతూ బయటికిరాసాగాయి. అయినా, వీరభద్రుడు భయంతో గుండె ఆగి చావక పోగా, పొట్టచెక్కలయ్యేలా నవ్వసాగాడు.

''ఓడిపోయావు, మరిడమ్మా! మరి, నాకొక మంత్రం నేర్పు,'' అన్నాడు వీరభద్రుడు.

''ఒరే, నీది గుండెకాదు; పలుగురాయి!'' అన్నది మంత్రగత్తె తిరిగి మామూలు రూపం తెచ్చుకుని.

తర్వాత, కొంతసేపు మౌనంగా వూరు కుని ''సరే మంత్రం నేర్పుతాను, మంత్ర గాళ్ళసంగతమాగాని, మంత్రగత్తెలు ఆడిన మాట తప్పరని ముల్లోకాలెరిగిన సత్యం,'' అని వీరభద్రుడికి ఒక మంత్రం చెప్పింది.

అది విన్న వీరభద్రుడు, ''అయ్యో, ఇంత చిన్నాచితుకు తేలు మంత్రమా!'' అన్నాడు.

దానికి మంత్రగత్తె కోపంగా, ''ఒరే భయం ఎరగని వెధవా! నీకు గొప్ప మంత్రాలు నేర్ప డానికి, నేనేం తెలివితక్కువదాన్నా,'' అన్నది.

''కాదని తెలుస్తూనే వున్నది, మరిడెమ్మా! కాని, నాదొక చిన్న శంక. మంత్రగత్తెలు కోరిన ఏరూపమైనా ధరించగలరు గాని, తేలు రూపం ధరించడం మాత్రం, వాళ్ళెంత గింజు కున్నా సాధ్యం కాదని, మా శంకలమ్మ అవ్వ చెపుతూండేది. మరి, నువ్వు తేలురూపం ధరించగలవా?'' అన్నాడు.

ఆ మాట తనకెంతో అవమానంగా భావించిన మంత్రగత్తె, కోపంతో నిలువెల్లా ఊగి పోతూ, ''ఎవడ్రా నువ్వు, మా తాత కుశ్శంకల కూర్మన్నలా వున్నావు!'' అంటూ, చప్పున తేలుగా మారి, వీరభద్రుణ్ణి కుట్టింది.

వీరభద్రుడు, అంతకు ముందు మంత్ర గత్తె తనకు నేర్పిన మంత్రాన్ని పఠిస్తూ, తేలు రూపంలో వున్న మంత్రగత్తెను, కాలితో గట్టిగా నొక్కాడు. మంత్రగత్తె గిలగిలా తన్ను కుంటూ చచ్చిపోయింది.

వీరభద్రుడు పరమానందంతో గుహకేసి చూసేంతలో, లోపలినుంచి అప్పటివరకూ అస్థిపంజరాలుగా వున్నవాళ్ళు బిలబిల మంటూ బయటకు వచ్చారు. వాళ్ళల్ల వీరభద్రుడి తమ్ముడు రామభద్రుడు కూడా వున్నాడు. వాడు తన అన్నను చూస్తూనే, ''అన్నా!'' అంటూ పరుగుపరుగున వచ్చి, వీరభద్రుణ్ణి కావిలించుకున్నాడు. మిగిలిన వాళ్ళు కూడా అక్కడికి చేరి, ''ఇక్కడినుంచి పారిపోదాం! మంత్రాలమరిడి ఎక్కడ?'' అంటూ భయంగా దిక్కులు చూడసాగారు.

వీరభద్రుడు, ''ఇదిగో ఇక్కడ!'' అంటూ వాళ్ళకు చచ్చిన తేలును చూపించి, జరిగినదంతా చెప్పాడు. అది విని అందరూ ఆశ్చర్యానందాలతో, వీరభద్రుణ్ణి భుజాలకెత్తుకుని, ''భయం ఎరగని వీరభద్రుడు!'' అని కేకలు వేస్తూ, గ్రామంకేసి బయలుదేరారు.



59. యుద్ధంలో పాండవుల విజయం

# మహాభారతం

పది రోజులు యుద్ధం చేసి భీష్ముడు యుద్ధరంగంలో పడిపోయాడు. ఆయన శిఖండితో యుద్ధం చెయ్యడు గనక, అర్జునుడు శిఖండిని ముందు పెట్టుకుని, వెనక నుంచి తాను బాణాలు వేస్తూ భీష్ముణ్ణి పడగొట్టాడు.

భీష్ముడు పడిపోయాడు గాని, వెంటనే చావలేదు. ఆయన శరీరం నిండా బాణాలు గుచ్చుకుని ఉండటం చేత, ఆయన పడిపోయినప్పుడు ఆయన శరీరం నేలకు తగలలేదు. ఆ స్థితిలో ఆయనకు దాహం వేస్తే, అర్జునుడు భూమిని బాణంతో కొట్టి, పాతాళ గంగను పైకి తెప్పించాడు. ఉత్తరాయణం వచ్చినదాకా భీష్ముడు అంపశయ్య మీద ప్రాణాలతో ఉన్నాడు.

భీష్ముడి అనంతరం కౌరవసేనలకు ద్రోణుడు సర్వసేనాధిపత్యం వహించి, అయిదురోజుల పాటు యుద్ధం చేశాడు. ఆయన పన్నిన పద్మ వ్యూహంలోకి ప్రవేశించి అర్జునుడి కొడుకైన అభిమన్యుడు శత్రు యోధుల మధ్య చిక్కి చనిపోయాడు. ఇది జరిగినప్పుడు అర్జునుడు దూరాన మరొక రంగంలో యుద్ధం చేస్తున్నాడు. అభిమన్యుడి వెనకగా మిగిలిన పాండవులు పద్మ వ్యూహంలో ప్రవేశించబోయారు. అయితే సైంధవుడు వారికి బలంగా అడ్డుపడ్డాడు. ఆ కారణంగా అభిమన్యుడికి ఎవరూ సహాయం లేకపోయారు.

ఈ సంగతి విని అర్జునుడు మర్నాడు సైంధవుణ్ణి చంపుతానని ప్రతిజ్ఞ చేసి అంత పనీ చేశాడు.





తరవాత ద్రోణుడూ, ధృష్టద్యుమ్నుడూ యుద్ధం చేస్తూండగా ధర్మరాజు అశ్వత్థామ చచ్చినట్టు అబద్ధం చెప్పాడు. తన కొడుకు చచ్చాడని ధర్మరాజు నోట విని ద్రోణుడు విరక్తితో అస్త్రసన్యాసం చేసి, ప్రాయోపవేశం చేశాడు. అదే మంచి సమయంగా భావించి ధృష్టద్యుమ్నుడు ఆయనను వెంటనే చంపాడు.

ద్రోణుడు చనిపోయిన అనంతరం కౌరవ బలాలకు కర్ణుడు సర్వసేనాని అయ్యాడు. కర్ణుడు శల్యుణ్ణి తనకు సారథిగా ఇప్పించమని దుర్యోధనుణ్ణి కోరాడు. శల్యుడు కర్ణుడికి సారథి కావటానికి ఒప్పుకున్నాడు, గాని అతను యుద్ధం చేసిన రెండు రోజులూ శల్యుడు అతన్ని అవమానిస్తూ, నిరుత్సాహపరుస్తూ వచ్చాడు. రెండవరోజు కర్ణుడు అర్జునుడితో యుద్ధం చేస్తూండగా అతని రథచక్రం బురదలో కూరుకుపోయింది. కర్ణుడు దాన్ని ఎత్తుతూండగా అర్జునుడు అతన్ని చంపేశాడు.

కర్ణుడి అనంతరం శల్యుడు కౌరవసేనాని అయినాడు. అయితే ఆయన ఆ రోజే ధర్మరాజుతో యుద్ధం చేస్తూ చచ్చిపోయాడు.

పద్ధెనిమిదో రోజున యుద్ధం ముగిసింది. ఆ యుద్ధంలో పద్ధెనిమిది అక్షౌహిణుల సేన పోయింది. దుర్యోధనుడు తప్ప అతని తమ్ములందరూ పోయారు. దుశ్శాసనుణ్ణి భీముడు భయంకరంగా చంపి అతని నెత్తురు తాగాడు.

యుద్ధంలో ఉభయపక్షాల యోధులూ అనేకవేలమంది చనిపోయారు. పాండవుల పక్షాన పాండవులూ, ఉపపాండవులూ, యుయుత్సుడూ, సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ మిగిలారు.

యుయుత్సుడు ధృతరాష్ట్రుడికి పుట్టినవాడు. యుద్ధం ముగియగానే అతను అక్కడి నుంచి హస్తినాపురానికి వెళ్ళిపోయాడు.

కౌరవుల పక్షాన అశ్వత్థామా, కృపుడూ, కృతవర్మా, దుర్యోధనుడూ మిగిలారు. యుద్ధం ఆఖరు దశలో కృపాశ్వత్థామలూ, కృతవర్మా దుర్యోధనుడి కోసం చూస్తే అతను ఎక్కడా కనిపించలేదు. అతను గద ఒకటి భుజాన పెట్టుకుని అమిత విచారంతో ఒక పెద్దమడుగు వద్దకు వెళ్ళాడు. కృతవర్మా, కృపుడూ, అశ్వత్థామా ప్రాణాలతో మిగిలారన్నది కూడా అతనికి తెలియదు.

మడుగు వద్ద కూర్చుని ఉన్న దుర్యోధనుడి వద్దకు సంజయుడు వచ్చాడు. తనకు అపజయం కలిగినందుకూ, తన

వారంతా పోయినందుకూ విచారిస్తున్న దుర్యోధనుడు సంజయుణ్ణి చూసి, ''మన వాళ్ళలో నువ్వు తప్ప ఇంకెవరూ మిగల లేదా? నేను ఈ మడుగులో ఇంకా ప్రాణా లతో ఉన్నానని నా తండ్రికి చెప్పు,'' అని మడుగులో ప్రవేశించాడు.

సంజయుడు అక్కడి నుంచి వచ్చేస్తూం డగా అతనికి కృతవర్మా, కృపుడూ, అశ్వ త్థామా కనబడి, ''సంజయా, దుర్యోధనుడు ఎక్కడ?'' అని అడిగారు.

సంజయుడు వాళ్ళకు మడుగును చూపించి, దుర్యోధనుడు జలస్తంభన చేసి అందులో ఉన్నట్టు చెప్పాడు.

అశ్వత్థామ పెద్దగా ఏడుస్తూ, ''అయ్యో, మేము బతికి ఉన్న సంగతి అతనికి తెలీదు కాబోలు. మేము నలుగురమూ కలిసి శత్రు వులను జయించలేమా?'' అన్నాడు. వాళ్ళు ముగ్గురూ పాండవులతో యుద్ధం చేస్తామని బయలుదేరారు. కాని వాళ్ళు రణరంగానికి చేరేసరికి చీకటి పడింది. కౌరవశిబిరానికి చెందిన స్త్రీలను సేవకులు హస్తినాపురానికి తీసుకుపోతున్నారు.

యుద్ధం అయిపోగానే పాండవులు కృష్ణు డితో సహా దుర్యోధనుడి కోసం వెతకసాగారు. దుర్యోధనుడు మడుగులో దాగిఉన్న సంగతి వారికి తెలిసింది. వాళ్ళు అక్కడికి వచ్చారు.

ధర్మరాజు దుర్యోధనుడితో, ''నీ వంశ మంతా నాశనమయ్యాక నీ ప్రాణాలు దక్కిం చుకోవటానికి మడుగులో దాక్కున్నావా? ఇది అక్రమం. బయటికి వచ్చి మాతో యుద్ధం చెయ్యి. నీవంటి గర్విష్ఠికి ఈ పిరికి తనం తగదు. మమ్మల్ని ఓడించకుండా



నీ రాజరికం నిలవదు. వచ్చి, మమ్మల్ని ఓడించు,'' అన్నాడు.

''నాకు రాజ్యం అక్కర్లేదు. నువ్వే అంతా ఏలుకో,'' అన్నాడు దుర్యోధనుడు.

''నీ నుంచి నాకు రాజ్యదానం అవసరం లేదు. అదీగాక, దానం చెయ్యటానికి నీకు ఇప్పుడు రాజ్యమూ లేదు. మడుగునుంచి వెలుపలికి వచ్చి మమ్మల్ని జయించి రాజ్యం పొందు, లేదా మా చేతిలో ఓడిపో,'' అన్నాడు ధర్మరాజు.

ఇలాటి సూటిపోటి మాటలతో పాండ వులు రెచ్చగొట్టేసరికి, దుర్యోధనుడు మడుగు నుంచి బయటికి వచ్చి, భీముడితో గదా యుద్ధం చేశాడు. భీముడు దుర్యోధనుడి తొడలు విరగగొట్టాడు.

తొడలు విరిగి పడిపోయి ప్రాణాలతో ఉన్న దుర్యోధనుడి వద్దకు కృపాశ్వత్థామ కృతవర్మలు వచ్చి, అతని దుస్థితికి విచారిం



చారు. అశ్వత్థామ ఆ రాత్రే పాండవులనూ, బతికి ఉన్న ఇతర పాంచాలులనూ చంపేస్తానని దుర్యోధనుడి దగ్గిర ప్రతిజ్ఞ చేశాడు. ఈ మాటకు దుర్యోధనుడు సంతోషించి, అశ్వత్థామను తన సర్వసేనానిగా నియమించాడు.

తరవాత ఆ యోధులు ముగ్గురూ బయలుదేరి పాండవ శిబిరాలకు సమీపంగా ఒక చోట దాక్కున్నారు. అక్కడ అరణ్యం ఉన్నది. అందులో ఒక వెయ్యి కొమ్మల మర్రిచెట్టు కింద వాళ్ళు విశ్రమించారు. అశ్వత్థామ శత్రువులను అన్యాయంగా, నిద్రపోతున్నప్పుడే చంప నిశ్చయించాడు. ఎందుకంటే, పాండవులు అలాంటి అన్యాయాలు యుద్ధంలో చాలా చేశారు. అతను కృపుణ్ణీ, కృతవర్మనూ ఇందుకు ఒప్పించి, వారితో బయలుదేరి పాండవ శిబిరానికి వచ్చాడు. కృపుణ్ణీ, కృతవర్మనూ అతను శిబిర ద్వారం వద్ద నిలబెట్టి, తాను కత్తిదూసి లోపల ప్రవేశించి, ముందుగా ధృష్టద్యుమ్నుణ్ణి నిద్రలేపి, అతన్ని చంపాడు. ఈ అలికిడికి కొందరు లేచి, అతని మీదికి వచ్చారు. అశ్వత్థామ అందరినీ చంపాడు. తరవాత అతను ఉపపాండవులందరినీ చంపాడు. శిబిరంలో వాళ్ళు మేలుకుని, వారిలో కొందరు అశ్వత్థామతో యుద్ధం చేసి చచ్చారు. బయటికి పారిపోతున్న వారిని కృపుడూ, కృతవర్మా చంపారు.

తరవాత ముగ్గురూచేరి శిబిరానికి, మూడు వైపులా అగ్గిపెట్టారు. తరవాత వాళ్ళు ఈ వార్తను దుర్యోధనుడికి చెప్పటానికి బయలుదేరారు.

ఆ రాత్రి పాండవులు ఆ శిబిరంలో లేరు. ఉన్నట్టయితే వాళ్ళు అశ్వత్థామ చేతిలో చావటమో, లేక వాళ్ళు అశ్వత్థామకు ఈ దారుణ హత్యాకాండ చెయ్యకుండా అడ్డుపడటమో జరిగేది.

కృపాశ్వత్థామ కృతవర్మలు వచ్చేసరికి దుర్యోధనుడు మరణవేదన పడుతున్నాడు. అతను వాళ్ళు చేసినదంతా విని, సంతోషిస్తూ ప్రాణాలు వదిలాడు.

తమ కొడుకులూ, బంధువులూ యుద్ధంలో గెలిచి కూడా హత్యకు గురి అయినట్టు తెలిసి, పాండవులూ, ద్రౌపదీ మొదలైనవాళ్ళు ఎంతో శోకించారు. ఇంత పని చేసిన అశ్వత్థామను చంపేస్తానని భీముడు బయలు దేరాడు. అప్పుడు ద్రౌపది, ''ఆ అశ్వత్థామ తలలో మణి ఉంటుందట. వాణ్ణి

చంపి, ఆ మణి తెస్తే నేను కళ్ళారా చూస్తాను,'' అన్నది.

భీముడు అమితావేశంతో ధనుర్బాణాలు తీసుకుని రథం మీద బయలుదేరాడు.

అది చూసి కృష్ణుడు భీముడికి తోడుగా అర్జునుణ్ణి కూడా వెళ్ళమన్నాడు. కృష్ణుడితోబాటు ధర్మరాజూ, అర్జునుడూ కూడా మరొక రథం ఎక్కి బయలుదేరారు. వాళ్ళు త్వరలోనే భీముణ్ణి చేరుకున్నారు, కాని భీముణ్ణి వెనక్కు మళ్ళించలేకపోయారు.

వాళ్ళు గంగాతీరాన్ని చేరేసరికి, వ్యాసుడూ, అతని అనుచరులైన ఋషులూ, వారి వెంట అశ్వత్థామా కనిపించారు. అశ్వత్థామ మట్టి గొట్టుకుని, నారబట్టలు కట్టుకుని ఉన్నాడు. అశ్వత్థామను చూస్తూనే భీముడు భయంకరంగా కేక పెట్టాడు. అశ్వత్థామ భీముణ్ణీ, అతని వెనకగా వచ్చే కృష్ణుడి వెంట ధర్మరాజునూ, అర్జునుణ్ణీ చూసి ఏమీ తోచక, తన తండ్రి తనకిచ్చిన బ్రహ్మశిరోనామకాస్త్రం అనే భయంకరమైన అస్త్రాన్ని ఆవాహన చేసి, ''అపాండవం అగుగాక!'' అని దాన్ని ప్రయో గించాడు.

కృష్ణుడు ప్రేరేపించగా అర్జునుడు కూడా అదే బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని అశ్వత్థామ పైకి ప్రయోగించాడు. రెండు అస్త్రాలూ భయంకరంగా మంటలు కక్కుతూ ఒకదాని నొకటి ఎదుర్కొన్నాయి.

అప్పుడు వ్యాసుడూ, నారదుడూ ముందుకు వచ్చి, ఇద్దరినీ అస్త్రాలు ఉపసంహరించమన్నారు.

అర్జునుడు తన అస్త్రాన్ని ఉపసంహరించాడు. అశ్వత్థామకు ఆ పని చేతకాలేదు.



అతను వ్యాసుడితో, ''నేను భీముణ్ణి చూసి ఈ అస్త్రాన్ని ప్రయోగించాను. దానిని ఉపసంహరించటం నావల్ల కాదు. ఇది పాండవులను ఎలాగైనా నిర్మూలించక విడవదు,'' అన్నాడు.

కృష్ణుడు ఆ మాట విని, ''సరే, పాండవుల అంకురం ఇప్పుడు ఉత్తరగర్భంలో ఉన్నది. దానిమీద నీ అస్త్రం ప్రయోగించు,'' అన్నాడు.

అశ్వత్థామ తన తలలో ఉన్న మణిని అర్జునుడి కిచ్చేటట్టూ, అర్జునుడు అతన్ని ప్రాణాలతో వదిలేటట్టూ ఋషులు రాజీ పరిచారు.

అశ్వత్థామ తన తలలోని మణి తీసి అర్జునుడికిచ్చి, తపస్సు చేసుకోవడానికి అడవులు పట్టిపోయాడు.

భీముడు ఆ మణి ని తీసుకుపోయి ద్రౌపదికిచ్చి, ''ఇక విచారించకు,'' అన్నాడు.

ద్రౌపది ఆ మణిని ధర్మరాజు తలలో ధరించ టానికి ఇచ్చింది.

హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు తన నూరుగురు కొడుకులూ యుద్ధంలో పోయి నందుకు అంతులేని విచారంలో మునిగి పోయాడు. సంజయుడు ఆయనతో, ''నీ కొడుకులే ఏమిటి? పద్దెనిమిది అక్షౌహి ణుల సేన నాశనమయింది. ప్రపంచంలో ఉన్న రాజులందరూ చచ్చారు. చచ్చిన వారికందరికీ ప్రేతకార్యాలు చేయించు,'' అన్నాడు.

ధృతరాష్ట్రుడి వెంట గాంధారీ, కుంతీ, ఇతర అంతఃపుర స్త్రీలూ ఏడుస్తూ యుద్ధ భూమికి వచ్చారు. ఈ సంగతి తెలిసి పాండ వులు కృష్ణుణ్ణీ, సాత్యకినీ, యుయుత్సుణ్ణీ వెంటబెట్టుకుని అక్కడికి వచ్చారు.

ధర్మరాజు ధృతరాష్ట్రుడికి నమస్కరించి, ఆయనను చూడటానికి వచ్చిన వారందరి పేర్లూ చెప్పాడు. ధృతరాష్ట్రుడికి లోపల మండిపోతున్నది. ఆయన ధర్మరాజును కౌగలించుకుని, తరవాత భీముణ్ణి కౌగ లించుకోబోయాడు. కృష్ణుడు భీముణ్ణి వెనక్కు లాగి, ఇనుప భీమవిగ్రహాన్ని ముందుకు తోశాడు. ధృతరాష్ట్రుడు ఆ విగ్రహాన్ని బలంగా కౌగలించుకునేసరికి, అది కాస్తా పిండి అయిపోయింది. అదే నిజంగా భీముడైతే చచ్చే ఉండేవాడు. ధృత రాష్ట్రుడి బలం వెయ్యి ఏనుగుల బలం! కాని ఇనుప విగ్రహాన్ని నుగ్గు చేసి ధృత రాష్ట్రుడు ముక్కులా, నోటా నెత్తురు కక్కుతూ కింద పడిపోయాడు. తరవాత ఆయన, ''అయ్యో, భీమా!'' అంటూ దొంగ ఏడుపు సాగించాడు.

కృష్ణుడు ఆయనతో, ''రాజా, విచా రించకు. నువ్వు నుగ్గు చేసినది భీముణ్ణి కాదు. ఇనుప విగ్రహాన్ని,'' అన్నాడు. ఆ విగ్రహం దుర్యోధనుడు తన గదా యుద్ధా భ్యాసం కోసం చేయించినది.

తరవాత కృష్ణుడు ధృతరాష్ట్రుణ్ణి ఊర డించాడు.

''నాకిప్పుడు పాండవులు తప్ప కొడుకు లెవరున్నారు?'' అంటూ ధృతరాష్ట్రుడు భీమార్జున నకుల సహదేవుల శరీరాలు నిమిరాడు.





# అష్టావధానం

అవధాని, పాండిత్యంలో తండ్రిని మించిన వాడని పేరు తెచ్చుకున్నాడు. అతడికి, తండ్రి పెట్టిన పేరు సదానందుడైనా, అవధాన విద్యలో అతడు చూపిన అసాధారణ ప్రతిభవల్ల, అందరూ అతణ్ణి అవధాని అని పిలవసాగారు.

అవధానవిద్యలో అతి కష్టమైనవి అష్టావధానమూ, శతావధానమూ. శతావధానంలో అవధాని చుట్టూ వంద మంది వుంటారు. ఒక్కొక్కరు ఒక్కొక్క ప్రశ్న అడుగుతారు. ఆ ప్రశ్నకు జవాబు పద్యరూపంలో చెప్పాలి. సాధారణంగా పద్యాలకు నాలుగేసి పాదాలుంటాయి. అవధాని మొత్తం పద్యాన్ని ఒక్క సారే చెప్పకూడదు. ముందుగా ఒక్కొక్కరికీ పద్యంలోని మొదటి పాదం వినిపించాలి. తర్వాతనుంచి ఎవరెవరు ఏయే ప్రశ్న వేశారో గుర్తుంచుకుని, ఒక్కరొక్కరికే రెండవ పాదం వినిపించాలి. అదే పద్ధతిలో మూడవ పాదం, నాల్గవ పాదం వినిపించాక, చివరగా అందరికీ ఎవరి పద్యం వారికి నాలుగు పాదాల తోటీ చెప్పాలి. జ్ఞాపకశక్తికీ, మేధాశక్తికీ, పాండిత్యానికీ పెద్ద పరీక్షగా వుండే, ఈ శతావధానాన్ని అవలీలగా చేసేవాడు, అవధాని.

శతావధానంకంటే కష్టమైనది అష్టావధానం. ఇందులో అవధాని చుట్టూ ఎనిమిది మంది ప్రశ్నలడిగేవారుంటారు. వీరిని పృచ్ఛకులంటారు. అవధాన సమయంలో ఈ పృచ్ఛకులు ఎనిమిది విపరీత తరహాల్లో పండితుణ్ణి పరీక్షిస్తారు. ఒకడు సమస్యనిచ్చి పూరించమంటాడు. రెండోవాడు అవధానిని పూవుతో మృదువుగా తాకుతూంటాడు. మూడోవాడు వెర్రిమొర్రి ప్రశ్నలతో వ్యర్థ ప్రసంగం చేస్తూంటాడు. నాల్గవవాడు చదరంగం ఆడతాడు. అయిదవవాడు అరువది నాలుగు అక్షరాలున్న ఒక శ్లోకంలోని అక్షరాలను, ఒక క్రమంలోకాక, తనకు తోచిన రీతిలో చెబుతూంటాడు. అంటే – ముందుగా ఏభై

రాయవరపు ఆదినారాయణరావు

రెండవ అక్షరం, తర్వాత పద్ధెనిమిది, తర్వాత ఒకటి - అలా తనకిష్టం వచ్చినట్లు చెబుతాడు. ఆరవవాడు పద్యం చెప్పమని సగంలో ఆపి, పండితుడు ఏ పదం వాడబోతున్నాడో ముందే ఊహించి, ఆ పదంకాక ఇంకేమైనా వాడాలంటాడు. ఏడవవాడు ఆగిఆగి గంటలు కొడుతూంటాడు. ఎనిమిదవవాడు వ్యాకరణానికి సంబంధించిన ప్రశ్నలు వేస్తూంటాడు. చివరలో అవధాని తనకిచ్చిన సమస్యలన్నింటినీ చమత్కారంగా పూరించాలి. తనకు పుష్పతాడనమెన్ని సార్లు జరిగిందో సరిగ్గా చెప్పాలి. వ్యర్థప్రసంగానికి తెలివిగా బదులివ్వాలి. చదరంగంలో ఎప్పటి కప్పుడు సరైన ఎత్తులు వేస్తూ ప్రత్యర్థి ఆటను కట్టించాలి. శ్లోకంలోని అక్షరాలన్నింటినీ గుర్తుంచుకుని వరుసక్రమంలో మనసులోనే కూర్చుకుని, ఆ శ్లోకమేమిటో చెప్పగలగాలి. పృచ్ఛకుడు నిషేధించిన పదాన్ని వదలి, అలాంటి మరొక పదాన్ని వాడుతూ పద్యం చెప్పగలగాలి. తను మొత్తం ఎన్ని గంటలు మోగడం విన్నాడో సరిగ్గా చెప్పాలి. వ్యాకరణంలోని ప్రశ్నలన్నింటికీ సరైన సమాధానాలు చెప్పాలి. ఒకే సారి ఎనిమిది విభిన్నకార్యాలు చేయవలసి వున్న క్లిష్టతరమైన అష్టావధానాన్ని, అవధాని అవలీలగా చేసి అందర్నీ ఆశ్చర్య పరుస్తుండేవాడు. అద్భుతమైన అవధాని పాండిత్యాన్ని పండితులు ఎంతగానో ప్రశంసించేవారు.

పాండిత్యంలో పరిపూర్ణుడైన అవధానికి పెళ్ళి చేయాలని తండ్రి నిర్ణయించుకున్నాడు. సిరిపురంలో వుంటూన్న మేనమామ కూతురు సుమతి, అతడికి తగిన ఇల్లాలవుతుందని తండ్రి ఉద్దేశం. అయితే, అవధానికీపెళ్ళి





ఇష్టం లేదు. తనంతటి పాండిత్యం వున్న యువతి తనకు ఇల్లాలైతే, ఇరువురూ ప్రతి రోజూ సాహితీగోష్ఠి చేయవచ్చునని అతడనుకునేవాడు. అవసరమయితే ఇంటి పనులకూ, వంటకూ వేరే మనిషిని పెట్టుకోవచ్చునని అతడి అభిప్రాయం.

ఒకనాడు తండ్రి, అవధానితో, ''నాయనా! పనివాళ్ళు సదుపాయాలు అమర్చితే అది పూటకూళ్ళ ఇల్లవుతుంది. ఎవరి ఇంటి పనులు వారే చేసుకున్నప్పుడే, అది ఇల్లనిపించుకుంటుంది. పెళ్ళి చేసుకున్నాక భార్యాభర్తలు పరస్పరం సహాయపడుతూ గృహకృత్యాలు చేసుకోవాలి. వారివల్ల కాని అదనపు పనులకే పనివాళ్ళను నియోగించాలి. జీవితానికి సాహితీగోష్ఠి ఒక్కటే పరమావధి అనుకుంటే మొక్కలు పూలు పూయవు, చెట్లు కాయలు కాయవు!'' అంటూ హితబోధ చేశాడు.

అంతా శ్రద్ధగా విన్న అవధాని, ''మీరు చెప్పింది బాగానే వున్నప్పటికీ, అది సామాన్యులకు చెల్లుతుంది. నేను అష్టావధానిని. నా భార్య నాకు తగినట్లు వుండాలనుకోవడంలో తప్పులేదు కదా!'' అన్నాడు.

కొడుక్కు పాండిత్యమే తప్ప లౌకికజ్ఞానం ఇంకా అబ్బలేదని గ్రహించిన తండ్రి చిరునవ్వు నవ్వి, ''ఒక్కసారి సిరిపురం వెళ్ళి సుమతిని చూసిరా. ఆ పిల్ల నీకు నచ్చకపోతే వేరే పిల్లను చూద్దాం,'' అన్నాడు.

సుమతి ఎంతో అందమైన పిల్ల. ఆమెను ఒక్కసారి చూస్తే, కొడుకుబుద్ధి మారగలదని తండ్రి నమ్మకం.

తన మనసుకు నచ్చకపోయినా, తండ్రి మాట కాదనడం దేనికిలే అని, అవధాని సిరిపురం వెళ్ళాడు. మేనమామ అతణ్ణి ఎంతో ఆప్యాయంగా ఆదరించాడు. ఆయన సుమతిని పిలిచి, ''చూశావా, నీ బావ వచ్చాడు. మనింట్లో నాలుగు రోజులపాటుంటాడు. ఏలోటూ జరక్కుండా చూసుకునే బాధ్యత నీది!'' అని చెప్పాడు.

సుమతి అందం చూసిన అవధాని కళ్ళు చెదిరిపోయాయి. మేనమామ ఆమెను తన సేవలకు వినియోగించడం, ఇద్దరికీ సాన్నిహిత్యాన్ని పెంచడానికేనని అతడు గ్రహించి, ''నాక్కావలసింది అందం కాదు; పాండిత్యం. అది వీళ్ళకు తెలియదు. తిరిగి వెళ్ళేముందు, ఆ విషయం చెప్పాలి!'' అనుకున్నాడు.

అయితే, తన అంచనా పొరబాటని, మర్నాడు సుమతి ప్రవర్తన చూసిన అవధాని గ్రహించగలిగాడు. ఆమె చురుకుదనం, ప్రవర్తన చూసి ఆశ్చర్యపోయాడు.

కోడికూయగానే నిద్రలేస్తుంది సుమతి. ఇంటి ముందు కళ్ళాపుచల్లి, అందమైన ముగ్గులు వేస్తుంది. వయసుపైబడి మంచం పట్టిన బామ్మకు వేళ ప్రకారం మందు లిస్తుంది. పూజాపునస్కారాల్లో మునిగిపోయిన తల్లికి అన్నీ అమర్చుతుంది. వదినకు వంటింట సాయం చేస్తుంది. అందరికీ ఫలహారాలు తనే స్వయంగా అందించి, అడిగేలోగానే మంచినీళ్ళు తెచ్చిపెడుతుంది. తండ్రికీ, అన్నకూ బయటకు వెళ్ళాలంటే బట్టలు తనే తీసి ఇస్తుంది. చెప్పులు దులిపి సిద్ధం చేస్తుంది. అన్నగారి చంటిపాపను చక్కటి పాటతో లాలిస్తూంటుంది. ఇంటికెవరు వచ్చినా, ఎవరెందుకొచ్చారో వెంటనే గ్రహించి, వారికి తగిన సమాధానాలిచ్చి పంపిస్తుంది. ఇన్ని చేస్తూ - కొత్తగా వచ్చిన బావ అవసరాలను ఎప్పటికప్పుడు చూసుకుంటుంది. అన్నిటికన్నా విశేషం - మధ్యమధ్య వీలు చేసుకుని, తన అందానికి మెరుగులు దిద్దుకుంటూ, ఎప్పుడు చూసినా అప్పుడే విరిసిన పువ్వులావుంటుంది. ఎవరైనా తనను వేళాకోళం చెయ్యబోతే, సందర్భోచితమైన సామెతలతో ఠక్కున బదులు చెప్పి, అవతలి వారిని నోరెత్తకుండా చేస్తుంది. అందర్నీ అంత బాగా చూసుకుంటుందనే తండ్రి, ఆమెను తన అవసరాలను గమనించేందుకు నియమించాడని, గ్రహించాడు అవధాని.

సాయంత్రం సుమతి, అవధానిని ఊరంతా తిప్పి అక్కడి విశేషాలనూ, కథలనూ, విష్ణాలయ మహాత్మ్యాన్నీగురించి వివరంగా చెప్పింది. అవధాని, ఆమెకు గల సాంస్కృతిక పరిజ్ఞానాన్ని మెచ్చుకుని, "మీ ఊరు గురించి



నీకు తెలిసినంతగా, మా ఊరు గురించి నాకు తెలియదనుకుంటాను,'' అన్నాడు.

సుమతి నవ్వి, ''ఊరికే నన్ను మెచ్చు కునేందుకు అలాగంటున్నావు కానీ, నీ పాండిత్యం లోకవిదితం కాదా! నీ గురించిన విశేషాలు చెప్పు, వినాలని వున్నది,'' అన్నది.

అవధాని తను చేసిన అష్టావధానం గురించి వివరించగా, సుమతి పెద్ద పెద్ద కళ్ళు చేసు కుని విన్నది. అతడు తన ముంజేతి కంక ణాన్ని చూపి, ''ఈ స్వర్ణకంకణం నాకు అష్టావధానానికే లభించింది,'' అన్నాడు.

సుమతి చిన్నగా నిట్టూర్చి, ''నాకూ ఇలా స్వర్ణకంకణం తొడిగించుకునేంత గుర్తింపు ఎప్పుడు వస్తుందో!'' అన్నది.

''సుమతీ, రోజంతా నువ్వు చేసే పనులు అష్టావధానాన్ని మించిపోయాయి. నీ జ్ఞాపక శక్తి, సామర్థ్యం రెండూ కూడా అపారం. నీకు ఇష్టమైతే నేను నీకు శిక్షణఇచ్చి ఏడాదిలో గొప్ప అవధానిని చేసి, అప్పుడు నిన్ను పెళ్ళిచేసు కుంటాను!'' అన్నాడు అవధాని.

సుమతి తల అడ్డంగా ఊపుతూ, ''కానీ నాకు అవధానిని కావాలని లేదు. శ్రోతలను రంజింపజేయడం ఒక గొప్ప కళే అయినా, నాకు మనుషుల అవసరాలు చూసి తోడ్పడ డంలోనే బ్రహ్మానందం వుంది. అందుకే ఇంట్లో అమ్మను పూజామందిరంలోకీ, వదినను వంటిం ట్లోకీనెట్టి, అన్ని పనులూ నేను చూసుకుంటు న్నాను,'' అన్నది.

ఈ మాటలు విని అవధాని తెల్లబోయాడు. అతడు నెమ్మదిగా, ''నువ్వు చెప్పింది నిజం! నా విద్య తీరిక సమయాల్లో కాలక్షేపానికీ, వినోదానికీ; అయితే, నీవిద్య ఇతరులను సుఖ పెట్టి, వాళ్ళకు తీరికనూ, విశ్రాంతినీ కలిగి స్తుంది. నా అష్టావధానం కంటే గొప్పది నీ అష్టా వధానం. నిన్నింకా గొప్పదాన్ని చేయాలను కోవడం, నా అవివేకం. నిజానికి ఈ స్వర్ణకంకణం ధరించే అర్హత నీకే వుంది,'' అంటూ, తన ముంజేతికంకణాన్ని తీసి ఆమెకు తొడిగాడు.

ఆ తర్వాత కొద్ది రోజులకే వారి వివాహం జరిగింది.





# లోకభీతి - పాపభీతి

శబరవాడి అనే గ్రామంలోని దేవాలయా నికి శంకరారాధ్యుడనే బ్రాహ్మణుడు అర్చ కుడుగా ఉండేవాడు. ఆయన ఎంతో దైవ భక్తిపరుడు. సహజంగా ఊళ్ళో ఆయనకు మంచి గౌరవం ఉండేది.

శంకరారాధ్యుడు చీకటితోనే లేచి నదికి స్నానానికి వెళ్ళి, అక్కడ ఉన్న కూరమళ్ళలో నుంచి తనకు కావలసిన కూరగాయలు కోసుకుని, ఇంటికి తీసుకుపోయి, భార్య కిచ్చి, ఆ తరవాతనే దేవాలయానికి వెళ్ళే వాడు.

ఇలా కూరగాయలు తీసుకోవటం దొంగ తనమని ఆయన అనుకోలేదు. తోటవాడు ఆయనకు కావలిసిన కూరగాయలు సంతో షంగా ఇస్తాడు. అయితే, అంత చీకటితో మళ్ళలో ఎవరూ ఉండరు. అందుచేత ఆయన ఆ కూరగాయలను అడిగి తీసుకునే అవ కాశం లేదు.

ఇదే చివరకు ప్రమాదంగా పరిణమించింది. కూరలతోటవాడికి తన తోటలో దొంగతనం జరుగుతున్నట్టు అనుమానం కలిగింది. వాడు ఒక రాత్రి తోటలో మాటు వేసుకు కూర్చున్నాడు. తెల్లవారుఝామున శంకరా రాధ్యుడు యథాప్రకారం స్నానానికి వచ్చి, తోటలోకి అడుగుపెట్టి, నాలుగే నాలుగు వంకాయలు కోసుకున్నాడు. కాయలు తెంపు తున్న చప్పుడు తోటవాడికి వినిపించింది. మసకవెలుతురులో వాడు పూజారిని గుర్తిం చక, వెనుకనుంచి వచ్చి, దుడ్డుకర్రతో బలంగా కొట్టాడు.

''శివ శివా!'' అంటూ పూజారి స్పృహ తప్పి పడిపోయాడు.

దెబ్బతిని పారిపోతాడనుకున్న దొంగ అక్కడే కుప్పకూలిపోయేసరికి తోటవాడు ఆశ్చర్యపడి దగ్గరికి వచ్చి చూస్తే, దొంగ పూజారేనని తెలిసింది. అంతేకాదు, తాను



ఊళ్ళోవాళ్ళందరికీ చెప్పి తనను చూపించటానికి వెళ్ళిఉంటాడు! పరువుగా బతుకుతున్న తనకు దొంగ అనేపేరు వస్తుంది! ఇక తాను ఊళ్ళో తల ఎత్తుకు తిరగలేడు సరికదా, తనకు మంచినీళ్ళు కూడా పుట్టవు.

ఇలా అనుకుని శంకరారాధ్యుడు కూడా గ్రామం విడిచి పరారీ అయిపోయాడు. అప్పటికి తూర్పు తెల్లవారుతున్నది.

పూజారి భార్య ఝాము పొద్దెక్కేదాకా భర్తకోసం ఎదురుచూసి, ఇరుగుపొరుగు వాళ్ళతో చెప్పింది. చీకటితో స్నానానికి వెళ్ళిన పూజారి ఇంకా తిరిగి రాలేదు. దేవాలయానికి తిన్నగా వెళ్ళాడేమోననుకుంటే అక్కడా లేడు. స్నానాలరేవు వద్ద వెతికితే పూజారి ఉపయోగించే చెంబు తోటకు సమీపంలో కనబడింది. అందుచేత ఆయన ప్రమాదవశాత్తు నదిలో కొట్టుకునిపోయి ఉంటాడని గ్రామస్థులు అనుకున్నారు.

కాని ఇంతలో మరొక విషయం బయట పడింది. అదేమిటంటే, తోటవాడు ఉదయం నుంచీ కనిపించటం లేదు. తోటలో ఒకమూల చెత్తపోగు కాలుతున్నది. దాన్ని కుళ్ళగించి చూస్తే కాలిన ఎముకలేవో కనబడ్డాయి.

తోటవాడు పూజారిని హత్యచేసి చెత్త కుప్పలో నిప్పు అంటించి, ఎక్కడికో పరారీ అయిపోయాడని గ్రామస్థులు నిశ్చయించుకున్నారు. తోటవాడి మీద హత్యానేరం ఆరోపించబడింది. వాణ్ణి పట్టుకునేందుకు రాజభటులు అంతటా వెతుకుతున్నారు.

ఒకసంవత్సరం గడిచింది. ఈ లోపుగా తోటవాడు బైరాగివేషం వేసుకుని చాలాదేశాలు తిరిగాడు. వాడికి తన పెళ్ళాం పిల్లల మీద

కొట్టిన దెబ్బకు పూజారి చచ్చిపోయినట్టు కూడా కనిపించాడు. ఆయనలో చలనం లేదు. ముక్కు దగ్గిర వేలుపెట్టి చూస్తే శ్వాస కూడా ఆడుతున్నట్టు లేదు.

తోటవాడు కొయ్యబారిపోయాడు. పూజారిని దొంగ అనుకోవటమే అపచారం. ఆయనను చావగొట్టడం మహాపచారం. ఈ సంగతి ఊళ్ళో తెలిస్తే తనను బతకనివ్వరని ఊహించి తోటవాడు ఆ క్షణంలోనే ఊరు విడిచి పారిపోయాడు.

అయితే పూజారి చావలేదు. తోటవాడు కొట్టిన దెబ్బ ఆయన వీపుపైన పడి ప్రాణం దిమ్మరపోయింది. చల్లగాలికి ఆయన క్రమంగా తేరుకున్నాడు. తన పరిసరాలు చూసుకున్నాక ఆయనకు జరిగినది జ్ఞాపకం వచ్చింది. తోటలో కాయలు కోసుకుంటున్నందుకు తనను తోటవాడు కాబోలు కొట్టాడు. వాడి జాడ కనిపించటం లేదు. తన దొంగతనం గురించి

గాలి మళ్ళింది. అందుచేత సాహసించి వాడు తన గ్రామానికి వచ్చి, ఊరి సత్రంలో చేరి, వాళ్ళూ వీళ్ళూ అనుకునే మాటలను బట్టి, తాను పూజారిని హత్య చేసినట్టూ, పూజారి శవాన్ని చెత్తకుప్పలో పెట్టి కాల్చినట్టూ ఊళ్ళో వాళ్ళు అనుకుంటున్నట్టు తెలుసుకున్నాడు. పూజారి శవాన్ని చూసినవాళ్ళు లేరు. అంటే పూజారి చావలేదన్నమాట. తాను పారిపోయాక పూజారి లేచి ఎటో వెళ్ళిపోయాడు.

పూజారి ఎక్కడ ఏ రూపంలో ఉన్నా పట్టుకోవాలని తోటవాడు నిశ్చయించుకుని ఊరూరా తిరుగుతూ, కనిపించిన సన్యాసినల్లా, బైరాగినల్లా పరీక్షగా చూడసాగాడు.

ఈ లోపల పూజారి కూడా సన్యాసి వేషం ధరించి తీర్థయాత్రలు చేసి, చివరకు ఇంటి మీద గాలిమళ్ళి, ఇంటిదారి పట్టాడు.

ఒకనాడు ఒక ఊరి సత్రంలో ఇద్దరూ తారసిల్లారు, తోటవాడు పూజారిని సమీపించి, ''మీ పేరు శంకరారాధ్యులు కాదూ? తమరు ఈ మారువేషంలో ఎందుకు తిరుగుతున్నట్టు?'' అని అడిగాడు.

పూజారి నిర్ఘాంతపోయి, ఆ బైరాగి త్రికాలజ్ఞుడనుకుని, ''అయ్యా, నేను కూరగాయలు దొంగతనం చేసి, తోటవాడిచేత చావుదెబ్బతిని, గౌరవంగా బతికినచోట దొంగ అనే అప్రతిష్ఠ తెచ్చుకోవటం ఇష్టం లేక, ఇలా దేశసంచారం చేస్తున్నాను,'' అని చెప్పాడు.

''అయ్యా, నేనే ఆ తోటవాణ్ణి, తమరని తెలీక కర్ర విసిరాను. ఆ పాపం చేసినందుకు అనుభవిస్తున్నాను. మిమ్మల్ని హత్య చేశానని పుకారు పుట్టింది. మీరు కూరగాయలు దొంగిలించారని ఎవరూ అనుకోలేదు. కాని నా కోసం రాజభటులు కారాడుతున్నారు. మీరు ప్రాణాలతో గ్రామంలో కనిపిస్తేనే గాని నా మీద నుంచి ఈ ఆరోపణ పోదు. నేను నా భార్యా బిడ్డలను చూసుకోవాలని తహతహలాడిపోతున్నాను. పదండి, మన ఊరుపోదాం,'' అన్నాడు తోటవాడు.

ఇద్దరి సమస్యా తీరిపోయింది. ఇద్దరూ కలిసి గ్రామానికి తిరిగి వచ్చారు. దైవ ప్రేరితంగా తమకిద్దరికీ ఒకేసారి తీర్థయాత్రలు చేయాలనిపించిందనీ, ఆ పని ముగించుకుని తిరిగి వస్తున్నామనీ వాళ్ళు గ్రామస్థులతో చెప్పారు. గ్రామస్థులు నిజమే కాబోలనుకున్నారు.





# చందమామ

## భారత దర్శనం పాఠకులకు క్విజ్

ఈ సంచికలోని ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రచురిస్తాం. ఈలోగా వాటి సమాధానాలు తెలుసుకోగలరేమో ప్రయత్నించి చూడండి.

1



(ఎ) సీత తండ్రి జనకుడు పాలించిన విదేహ రాజ్యంగా భారత ఉపఖండంలో ఏ భాగాన్ని పిలిచేవారు? రాజధాని మిథిలా నగరం ఎక్కడ ఉండేది?

(బి) ప్రాచీనకాలంలో కోసలదేశంగా ఏ ప్రాంతాన్ని చెప్పేవారు? దాని రాజధాని శ్రావస్తి ఎక్కడ ఉండేది?

(సి) లిచ్ఛవులు నివసించిన వైశాలి ఎక్కడ ఉండేది?

(డి) ప్రాచీన కళింగ రాజ్యంలోని కోశాలి ఎక్కడ ఉండేది?

(ఇ) గాంధార దేశం అంటే ఏది?

2

బ్రాహ్మణ యువకుడొకడు అడవిగుండా వెళుతూ దారి తప్పాడు. కోయవాళ్ళు అతన్ని తమ నాయకుడి దగ్గరికి తీసుకు వెళ్ళారు. అతడు కోయనాయకుడి కుమార్తెను పెళ్ళాడి అక్కడే కొన్నాళ్ళు గడిపాడు. కోయనాయకుడు రోజూ వేకువజామున ఎక్కడికో వెళ్ళిరావడం అతడు గమనించాడు. తమ వంశస్థులు తరతరాలుగా ఆరాధిస్తున్న గుహలో వున్న దేవుణ్ణి తన తండ్రి పూజించి వస్తున్నాడని కోయనాయకుడి కూతురు భర్తకు చెప్పింది. అక్కడికి వెళ్ళి చూడాలని యువకుడు పట్టుబట్టాడు. యువకుడి కళ్ళకు గంతలు కట్టి తీసుకు వెళ్ళిరావడానికి కోయనాయకుడు సమ్మతించాడు. అయితే ఆ యువకుడు ఎవరికీ తెలియకుండా గుప్పెడు ఆవగింజలు తీసుకుని దారిపొడవునా జారవిడుస్తూ వెళ్ళాడు. కొన్నాళ్ళకు అవి మొలిచాయి. వాటి గుర్తుగా యువకుడు రహస్యంగా గుహలోకి వెళ్ళి, తన మామ పూజిస్తున్న వస్తువును అపహరించుకుని రాజధానికి చేరాడు. రాజు ఆ పవిత్ర వస్తువును కొత్తగా తయారుచేసిన విగ్రహంలో భద్రపరచి ఆలయంలో ప్రతిష్ఠించాడు. అది ఈనాటికీ ఒక సుప్రసిద్ధ దేవాలయంలో పూజింపబడుతోంది. ఆ ఆలయం ఏది? అక్కడి దేవుడి పేరేమిటి? బ్రాహ్మణ యువకుడూ, అతని భార్యా, మామల పేర్లేమిటి? పవిత్ర వస్తువును ఆలయంలో ప్రతిష్ఠించిన రాజు ఎవరు?



కథకు సరైన ముగింపు రాయండి! చక్కని బహుమతి గెలుచుకోండి!

# సృజనాత్మక పోటీ!

*ఒక చిన్నకథ తొలిభాగం దిగువ ఇవ్వబడింది. ఆసక్తికరమైన కథగా రూపొందే అంశాలన్నీ అందులో ఉన్నాయి. అయితే, దాన్ని రసవత్తరంగా మలిచే శక్తి మీ చేతుల్లోనే ఉంది. సరైన ముగింపుతో, మిగిలిన కథను రాయండి. కథకు తగిన పేరు పెట్టండి. మీ రచన 200 పదాలకు మించకుండా ఉండాలి. ఉత్తమమైన ముగింపుకు ఆకర్షణీయమైన బహుమతి ఇవ్వబడుతుంది. ఈ పోటీ మన యువపాఠకుల కోసమే నిర్దేశించబడింది. మీ పేరు, వయసు, చదివే తరగతి, పాఠశాల, పిన్‌కోడ్‌తో సహా మీ ఇంటి చిరునామా రాయడం మరిచిపోకండి. పెద్దలకన్నా మీరే చక్కగా రాయగలరని నిరూపించడానికి ఇదొక అరుదైన అవకాశం. అందువల్ల పెద్దల సాయం తీసుకోకండి. ఇక కథను చూద్దాం:*

వెంకన్న వెంకటాపురంలో చిన్నరైతు. యువకుడైన వెంకన్న తనకున్న ఎకరం పొలంలో కాయకష్టం చేసి సకాలంలో పైరుపెట్టి దానిమీద వచ్చే ఆదాయంతో తృప్తిగా కాలం గడిపేవాడు. తన పొలాన్నీ, పంటనూ వెంకన్న ప్రాణసమానంగా కాపాడుకుంటూ వచ్చేవాడు.

ఒక యేడు వెంకన్న పొలంలో వర్షాలులేక పంటలు సరిగ్గా పండలేదు. కరువుకాలం కాబట్టి అతని పొలంలొ వున్న కొద్దిపాటి పంటను కూడా రాత్రుల్లో దొంగలు దోచుకుపోయారు.

మరుసటి యేడు మంచి వర్షాలు కురిశాయి. ఏపుగా పెరిగిన పంటలతో పొలాలన్నీ కన్నుల పండుగ చేశాయి. వెంకన్న పొలంలో జొన్నపంట కోతకుసిద్ధంగా వుంది. నిరుటిఅనుభవం కారణంగా, వెంకన్న ముందుజాగ్రత్తతో పొలంలో ఒక మూలగా గుడిసె వేసుకుని పంటకు కాపలా కాయసాగాడు.

ఒకనాటి రాత్రి అతని పొలం ఆవలివైపు నుంచి ఏదో అలికిడి వినిపించింది. ఎవరో దొంగతనంగా పొలంలో పడ్డారని అతడు గ్రహించాడు. దుడ్డుకర్రను అందుకుని చప్పుడు వినిపిస్తున్న దిక్కుకేసి పరిగెత్తాడు.

వెన్నెల మసక వెలుతురులో నలుగురు జొన్న కంకెలు కోయడం కనిపించింది. మరి కొంచెం ముందుకు వెళ్ళేసరికి, నవ్వుకుంటూ కంకెలు కోస్తున్న నలుగురూ పక్క గ్రామానికి చెందిన వాళ్ళని తెలిసిపోయింది. ఆ నలుగురిలో ఒకడు బ్రాహ్మడు. మరొకడు స్వర్ణకారుడు. ఇంకొకడు వడ్డీవ్యాపారి. ఆఖరివాడు తనలాంటి చిన్నరైతు.

ఆ నలుగురినీ ఒంటరిగా ఎదుర్కోవడానికి వెంకన్న భయపడ్డాడు. సాయం కోరుతూ గట్టిగా అరవాలని కూడా వాడు అనుకోలేదు. తన కేకలు విని వాళ్ళు పారిపోవచ్చు. వాడు వేరొక పథకం ఆలోచించాడు. దుడ్డుకర్రను అవతలికి విసిరి వేసి, ధైర్యంగా వాళ్ళకేసి అడుగులు వేశాడు.

వెంకన్న వాళ్ళలో ఒక్కొక్కరిని ఎలా ఎదుర్కొన్నాడు? వాళ్ళు తమ హీనకృత్యానికి సిగ్గుపడ్డారా? మీరు చూపే పరిష్కారం యుక్తియుక్తంగా ఉండాలి. ముగింపురాశాక కథకు పేరుపెట్టడం మరిచిపోకండి. మీ ఎంట్రీలమీద 'సృజనాత్మక పోటీకి' అని రాసి డిసెంబర్ 20వ తేదీ లోగా మాకు చేరేలా పంపండి.

## నవంబర్ 2000 భారతదర్శనం క్విజ్ సమాధానాలు

1. ఎ. కుచేలుడనే సుదాముడు.
   బి. ప్రహ్లాదుడు.
   సి. ధ్రువుడు.
   డి. హరిశ్చంద్రుడి కుమారుడు లోహితాస్యుడు ; రాణి చంద్రమతి ;
   ఇ. అభిమన్యుడు.
2. మెయ్‌కండార్ ; సదాశివాచార్య.



# కొడుకు నిర్ణయం

ఆఫ్రికాదేశంలోని ఒక అడవి సమీపంలో డోటున్ అనే పేదవాడు, అడవిలో కట్టెలు కొట్టి వాటిని అమ్మి పొట్టపోసుకునేవాడు. తన కొడుకు టుండీ చూస్తూండగానే పన్నెండేళ్ళవాడై చేతికి అంది రావడం గమనించి అతడెంతో మురిసి పోయాడు. టుండీ రోజూ తండ్రి వెంట అడవికి వెళ్ళి, కట్టెలు కొట్టడంలో అతడికి సాయ పడేవాడు.

ఒకనాడు డోటున్‌కు జ్వరం వచ్చింది. అతడు మంచంపైనుంచి లేవలేక కొడుకును అడవికి వెళ్ళి కట్టెలు కొట్టుకురమ్మన్నాడు. టుండీ అడవి కేసి నడిచాడు. అయితే దారిలో తన ఈడు స్నేహి తులు కనిపించడంతో, వాళ్ళతో ఆడుకుంటూ చాలాసేపు గడిపేశాడు. మధ్యాన్నం తిరిగివెళ్ళే టప్పుడు కొద్దిగా కట్టెలు కొట్టి ఇంటికి తీసుకు వచ్చాడు.

దానిని చూడగానే డోటున్‌కు పట్టరాని కోపం వచ్చింది. ''పనికిరాని మొద్దు వెధవా? ఇంత చిన్న మోపు తెస్తున్నావే దీన్నేం చేయను? ఈ రోజు కట్టెలు అమ్మకపోతే రేపు తినడానికి కంచంలోకి ఎలా వస్తుందనుకున్నావు?'' అంటూ కొడు కును చెంపమీద కొట్టాడు. కొడుకు ఏడుస్తూ ఇంటి నుంచి బయటికి పరిగెత్తాడు.

''వెళ్ళిపో! అలాగే వెళ్ళిపో! ఇంటిలోపల అడుగుపెట్టావో కాళ్ళు విరగ్గొడతాను,'' అంటూ డోటున్ కొడుకుపై కేకలు పెట్టి మళ్ళీ ముసుగు దన్ని అలాగే పడుకున్నాడు.

టుండీ ఏంచేయడానికీ తోచక అడవికేసి నడవసాగాడు. చాలా దూరం వెళ్ళాక, అల సటతో, ఆకలితో ఆపైన అడుగు వేయలేక పోయాడు. ఒక చెట్టు కింద కూర్చుని అలాగే నిద్రపోయాడు.

సాయంకాలమయింది. పట్టణం నుంచి ధనికుడైన ఒక వర్తకుడు తన సేవకులతో ఆ దారి గుండా వెళుతూ చెట్టుకింద నిద్రపోతూన్న కుర్రవాణ్ణి చూసి, అతన్ని తట్టినిద్రలేపి, ''ఎవరు

ఆఫ్రికా జానపద కథ

నాయనా నువ్వు? ఎటూగానివేళలో ఈ అడవిమధ్య ఇలా నిద్రపోతున్నావేమిటి?'' అని అడిగాడు.

''నాకు ఇల్లు లేదు. ఆకలిగా వుంది,'' అన్నాడు టుండీ. వర్తకుడు వాడికి రొట్టెలు ఇచ్చాడు. వాడు వాటిని తిని నీళ్ళు తాగాడు. వర్తకుడికి ఆ కుర్రవాడి మీద ప్రేమ కలిగింది. ఆయనకు పిల్లలు లేరు. వాణ్ణి తన వెంట ఇంటికి తీసుకుపోయాడు.

మధ్యాన్నం వెళ్ళిన కొడుకు పొద్దుగూకినా ఇంటికి రాలేదేమిటా అని డోటున్ ఆందోళన చెందసాగాడు. తను అంత కోప్పడి ఉండకూడదేమో అనుకున్నాడు. తెల్లవారకముందే లేచి కొడుకు కోసం ఎక్కడెక్కడో వెదికాడు. కనబడిన ప్రతి ఒక్కరినీ అడిగాడు. కాని వాడు కనిపించలేదు. ఆ బాధను తట్టుకోలేక తల్లడిల్లిపోయాడు. రోజులు దొర్లిపోతున్నాయిగాని, కొడుకుజాడ మాత్రం కనిపించలేదు. కొడుకుకోసం ఎదురు చూస్తూ కాలం గడపసాగాడు.

ఇక్కడ వర్తకుడు టుండీని సొంత కొడుకులా భావించి ఆప్యాయంగా పెంచసాగాడు. వ్యాపారంలో మెళకువలను నేర్పాడు. టుండీకి రోజులు హాయిగా గడిచిపోతున్నప్పటికీ, తన తల్లిదండ్రులు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా అతని గుండె విలవిలలాడేది. తన ఇంటినీ, తల్లితండ్రులనూ మరచిపోలేకపోయేవాడు.

విశ్వాసమూ, నిజాయితీ కలిగిన టుండీ పట్ల వర్తకుడికీ ఆయన భార్యకూ క్రమంగా ఆదరాభిమానాలు పెరిగాయి. కన్నకొడుకులా భావించి అతనిపై అమిత వాత్సల్యం కనబరచసాగారు. ఇలాగే కొన్ని సంవత్సరాలు గడిచాయి.

డోటున్ ఒకనాడు అడవిలో దొరికిన ఏనుగు దంతాన్ని పట్టణంలో అమ్మి ఇంటికి తిరిగి వెళుతూండగా, గుర్రం మీద తన కొడుకులాంటి ఒక యువకుడు కనిపించగానే, ''బాబూ, ఆగు!'' అన్నాడు. అతడు ఆగాడు. డోటున్ అతన్ని సమీపించి పరిశీలనగా చూస్తూ, ''నువ్వు టుండీవే కదా? తప్పిపోయిన నా బిడ్డవే కదా?'' అని అడిగాడు.

టుండీ గుర్రంపైనుంచి దిగి, ''అవును, నేను టుండీనే,'' అంటూ తండ్రికి నమస్కరించాడు.

వయసు ఉడిగిపోయి తన తండ్రి మరీ బలహీనంగా ఉండడం చూసి టుండీ బాధపడ్డాడు. ''నాన్నా! నేను ఇప్పుడున్న ఇంటికి వచ్చి విశ్రాంతి తీసుకుని వెళ్ళు,'' అన్నాడు తండ్రితో.

''అలాగే బాబూ,'' అన్నాడు డోటున్.

ఇద్దరూ కలిసి వర్తకుడి ఇల్లు చేరారు. టుండీ తన తండ్రిని వర్తకుడికి పరిచయం చేశాడు. వర్తకుడు అతన్ని ఆప్యాయంగా పలకరించాడు.

తెల్లవారగానే డోటున్ ఇంటికి బయలుదేరుతూ, వర్తకుడితో, ''నేను నా కొడుకును నాతో మా ఇంటికి తీసుకుపోతాను,'' అన్నాడు.



"అదెలా సాధ్యం మిత్రమా? అతడిప్పుడు నీ కొడుకు కాదు; నా కొడుకు. నువ్వు ఇంటి నుంచి అతన్ని వెళ్ళగొట్టావు. నేను నీడనిచ్చి నప్పుడు అతడికి ఇల్లు లేదు. కాబట్టి ఇదే అతడి ఇల్లు," అన్నాడు వర్తకుడు వినయంగా.

"దేవుడు కనికరించడంతో, ఇంతకాలానికి నా బిడ్డ మళ్ళీ నాకు కనిపించాడు. అతన్ని ఇక్కడే వదిలి నేనెలా వెళ్ళగలను? వాడిపై కోప్పడినమాట వాస్తవమే. అయినా, తండ్రి కొడుకుపై కోప్పడడం అసహజం కాదు కదా?" అన్నాడు డోటున్ బాధగా.

"అయితే, ఇన్ని సంవత్సరాలు ఆప్యాయంగా పెంచి పెద్దచేసి, ఇప్పుడు వదులు కోవడం అంటే మాకేమో అసహజంగానే ఉంటుంది," అన్నాడు వర్తకుడు.

ఇలా చాలాసేపు తర్జనభర్జనలు పడ్డాక వర్తకుడు, "ఈ సమస్యకు ఒక పరిష్కారం చెబుతాను. ఈ విషయాన్ని టుండీకే వదిలిపెడదాం. ఇక్కడే ఉండిపోవాలా? నీతో తిరిగి రావాలా? అన్నది అతడే నిర్ణయిస్తాడు, సరేనా?" అన్నాడు.

"అలాగే! టుండీదే తుది నిర్ణయం!" అని డోటున్ సంతోషంగా అంగీకరించాడు.



"అయితే, ఈ విషయాన్ని రేపు ఉదయం తేల్చుకుందాం!" అన్నాడు వర్తకుడు.

మరునాడు ఉదయం వర్తకుడు, తండ్రీకొడుకులను తనవెంట రమ్మని ముందు నడిచాడు. ఆయన చేతిలో తళతళలాడుతూ పొడవాటి కత్తి ఉండడంచూసి తండ్రీకొడుకులిద్దరూ విస్మయం చెందారు. అయినా మాట్లాడకుండా ఆయన వెంట నడిచారు.

అడవికీ, నదికీ మధ్య నిర్మానుష్యంగా ఉన్న ఒక చోట వర్తకుడు ఆగాడు. తన చేతిలోని కత్తిని టుండీకి అందించి, "నాయనా! ఇప్పుడు నువ్వు నీ కర్తవ్యం నిర్వహించు," అన్నాడు.

"ఇప్పుడు నేనేం చేయాలి?" అని అడిగాడు టుండీ వినయంగా.

"నీ మొదటి తండ్రి వెంట నువ్వు వెళ్ళాలని నిర్ణయించినట్టయితే, నా తలను తెగనరుకు! నీ రెండవ తండ్రినైన నాతో ఉండిపోవాలనుకుంటే అతని తల నరుకు!" అన్నాడు వర్తకుడు.

టుండీ కొంతసేపు మౌనంగా తలవంచుకున్నాడు. ఆ తరవాత ఇద్దరికీ వంగి నమస్కరించి, "నా కర్తవ్యం ఇప్పుడు నాకు బోధపడింది. నా తలనే తెగనరుక్కుంటాను," అంటూ కత్తిని పైకెత్తాడు.

"ఆగు నాయనా!" అంటూ ఇద్దరూ ఒక్క సారిగా అతన్ని అడ్డుకున్నారు.

ముగ్గురూ కన్నీళ్ళు ఆపుకోలేక పోయారు.

ఆ తరవాత సమస్యకు వాళ్ళొక భిన్నమైన పరిష్కారం కనుగొన్నారు. డోటున్, అతని భార్య వచ్చి వర్తకుడి ఇల్లు చేరారు. కన్నవారికీ, పెంచి ప్రయోజకుణ్ణి చేసిన వారికీ ఆనందం కలిగించి టుండీ పదిమందిలో మంచివాడని పేరు తెచ్చుకున్నాడు.


THE AMUL CHEESE BOY
IN PICNIC PANIC


One bright sunny day...


...a picnic is in progress.


Little Munnu Verma crawls away.
GURGLE


Suddenly, huge rocks come tumbling down the mountain.
RUMBLE


Amul cheese boy eats an Amul cheese slice...


...and becomes strong and powerful.


He smashes the falling rocks...
BANG


...reducing them to small pieces.
CRACK


Munnu is rescued and back with his family.


All thanks to the cheese that has more milk in it.


Amul cheese slices.
Amul cheese. Yes please!
Amul



# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

ఫోటో వ్యాఖ్యల పోటీ, చందమామ, వడపళని, చెన్నయ్-600 026.





వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్ కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీ లోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఫిబ్రవరి 2001 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

## అభినందనలు



అక్టోబర్ 2000 నెల సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు :

అచూరి రాజేంద్రప్రసాద్
అసిస్టెంట్ ప్రొఫెసర్ ఆఫ్ స్టాటిస్టిక్స్
యూనివర్సిటీ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల
సుబేదారి, వరంగల్ - 506 001 (ఆం.ప్ర)



మొదటి ఫోటో : ఏదో అందుకోవాలని ఆరాటం!
రెండవ ఫోటో: ఇంకా పైకి చేరాలని ఉబలాటం!!

